# సర్పసత్రము

(నాటిక)

నోరి నరసింహ శాస్త్రి



నోరివారు : రేపల్లె

రూపాయి పావలా

# సర్పసత్రము

కవిసమ్రాట్
నోరి నరసింహ శాస్త్రి

నోరివారు : రేపల్లె
. గుంటూరు జిల్లా .

# పరిచయము

జనమేజయుడు సర్పయాగము చేసిన కథ మహాభారత ములో విపులముగా వర్ణింపబడినది. ఆస్తీకపర్వ మని 45 అధ్యాయా లున్న ఉపపర్వ మంతా అదే కథ. నన్నయ భట్టారకులు దాని నాంధ్రీకరించుటలో చాలా సంక్షేపించినారు.

శ్రీ దేవీభాగవతములోకూడ ద్వితీయ స్కంధములో ఈ ఘట్టము కలదు. ఆభిచారిక మైన ఈ యాగమును వర్ణించు టలో కొంతప్రయోగ విశేషము సూచింపబడినది. అంబామఖ పురస్సరముగా సర్పసత్రము జరిగిన ట్లందులో కలదు.

శ్రీమద్భాగవతము ద్వాదశస్కంధములో కూడ ఈ కథ సంక్షేపముగా ఉన్నది. అందులో తక్షకుని పిలుచుటలో 'తక్ష కాశు పత స్వేహ సహేంద్రేణ మరుత్వతా' అని బ్రహ్మ చెప్పిన ట్లున్నది.

తక్షకునికి చెందవలసిన ఆహుతి వేసే సందర్భంలో 'తక్షకాయ స్వాహా' అని వేలుస్తారు. అంతే కాని తక్షకుడే ఆహుతి కావలసినప్పుడు ఆ విధంగా ప్రయోగించరు. ఐనా 'సహేంద్ర తక్షకాయ స్వాహా' అనే అపప్రయోగము లోకంలో ఎందువల్లనో ప్రచారంలో ఉన్నది. వెలిగందల నారయ తన యాంధ్రీకరణములో 'సహేంద్ర తక్షకా యాను బ్రూహి యను ప్రేషవాక్యంబులు నొడువునంత' అని వ్రాసినది దీనికి మూలము కావచ్చును.

సర్పసత్రము విరోధము సాధించడానికి చేసిన ఆభిచారిక క్రియ. ఇతర మైన ఏ ఆభిచారిక క్రియయూ ఇంత విపులముగా ప్రసిద్ధమైన పురాణములలో వర్ణింప బడ లేదు. సత్రయాగములో ఋత్విక్కులు బ్రహ్మదండము అనే ఒకానొక భయంకర మారణశక్తిని సృష్టించి దానితో మహానాగములను ఆకర్షించి సత్రాగ్నిలో పడ గొట్టినారు.

ద్వేషముతో సాధించే ప్రతిక్రియలో కంటె ద్వేషమునే జయించినప్పుడు యజమానికి ఎటువంటి విశేషానందము కలుగుతుందో, అది యజమానికే కాక జగత్తుకుకూడా ఎంత మంగళకరమో సర్పసత్ర కథ ఉపదేశిస్తూ, ప్రత్యేకముగా నేటి కాలము వారికి మార్గదర్శకము కావచ్చును.

రేపల్లె నోరి నరసింహ శాస్త్రి

24—11—60

# సర్ప సత్రము

## మొదటి అంకము

[జనమేజయుని ఆస్థానము:- జనమేజయుడు, సోమశ్రవసుడు, మంత్రి, రాజపురుషులు]

### జనమేజయుడు

కంఠభాగములో సర్పదష్టుడైన మహాపురుషు డెవరో తరచుగా స్వప్నములో గోచరిస్తున్నాడు. ఆ దివ్యపురుషు డెవరోగాని, నా వైపు మిక్కిలి వాత్సల్యంతో చూస్తాడు. ఈ స్వప్న ఫలము పెద్దలు నిర్ణయించవలె.

### సోమశ్రవసుడు

ఆ దివ్యపురుషుడు నీతో ఏమైనా సంభాషించినాడా, మహారాజా?

### జనమేజయుడు

సంభాషించలేదు కాని పారిపోతున్న మహాసర్పము వంక చూపుతూ నా వైపు దీనంగానూ తీక్ష్ణంగానూ చూస్తాడు. ఆ చూపే మాటలకంటె స్పష్టంగా నన్ను ఒకానొక కఠినమైన మహాత్కార్యము చేయమని ప్రేరేపుతున్నట్లుంటుంది.

### మంత్రి

అనేక యజ్ఞాలు చేసి దేవలోకమూ మనుష్యలోకమూ తుష్టి పొందించిన నీవు కొరతపెట్టిన మహాత్కార్య మేమున్నది, ప్రభూ!

జనమేజయుడు

ఆ స్వప్నపురుషుని చూపులో కనిపించే వాత్సల్యాన్నిబట్టి చూస్తే ఆయన ఎందువల్లనో శాంతిలేని ఉత్తముడైన పితృ దేవత ఏమో అనిపిస్తున్నది.

సోమశ్రవసుడు

ఇంకా సెలవియ్యని విశేష మేమైనా నీ స్వప్న వృత్తాంత ములో ఉన్నదా ?

జనమేజయుడు

అద్భుతమైనదే అది! ఆ సర్పక్షతములోనుంచి రక్తము చిమ్మి నట్లే అగ్నిజ్వాల ప్రదక్షిణశిఖగా పుట్టి పారిపోయే ఆ మహా సర్పాన్ని తరుముతూ ఉన్నది. మాకది తలుచుకుంటే ఇప్పుడే దేహము గగుర్పొడుస్తున్నది.

మంత్రి

నైజముగా సర్పశత్రువైన మహారాజు నీ స్వప్నము కలవర పెట్టుతూ ఉండవలె!

జనమేజయుడు

మాకు సర్పద్వేష మిందువల్ల సహస్రగుణముగా తీవ్రమవు తున్నది. ఈ స్వప్నఫలము పెద్ద లింకా సెలవీయ లేదు.

సోమశ్రవసుడు

జనమేజయచక్రవర్తి శీఘ్రకాలములో అపూర్వమైన ఒకానొక

క్రతువుకు దీక్షితుడు కావడమే దీని ఫలము. ఆ మహాక్రతువు దుష్టశిక్షణచణ మైనది.

మంత్రి - సభ్యులు

తథాస్తు ! తథాస్తు !

జనమేజయుడు

[లేచి పరిషత్తుకు నమస్కరిస్తూ]

మహాప్రసాదము ! శిరసావహిస్తాను.

[తెరలో] ద్వారికుడు

రాజకులదీప ! రాజాధిరాజ ! వివిధ
యజ్ఞకర్మ సంతోషిత హవ్యవాహ,
ద్వారమున నిల్చినాడు నీ దర్శనార్థి
విప్రతరుణుండు దుఃఖసంవిగ్నమూర్తి !

మంత్రి [రాజాజ్ఞ పొంది]

రమ్మను !

రురుడు [ప్రవేశించి]

స్వస్తి ! నేను రురుడను రాజా !

జనమేజయుడు

చిన్నవాడా ! నీకీ ఈడులోనే కళ్ళు ఎర్రపడి నెత్తురుముద్ద లైనవి. నీ కేమి ఆపద వచ్చింది నాయనా? మాతో ఏమి పని

కలిగింది ?

రురుడు

దుష్టశిక్షణము యాచించుటకు వచ్చినాను స్వామీ! నేను ప్రమద్వరను వరించినాను. అది మానవుల బిడ్డ కాదు రాజా !

జనమేజయుడు

మరి, మరి—!

రురుడు

అది అప్సరస బిడ్డ! విషసర్ప మొకటి కాటువేస్తే అశోకపుష్పము వంటి దాని దేహము కాటుక కమ్మి నిశ్చేష్ట మయింది, మహారాజా !

జనమేజయుడు

అయ్యో, నేనేమి చేయగలను, చిన్నవాఁడా! ధర్మ రాజాజ్ఞను ఈ లోకంలో రాజులుకూడా జవదాట లేరుగదా, బాబూ !

రురుడు

ప్రమద్వరకయి నేను నా ప్రాణాలైనా ఇస్తాను, యమలోక మైనా వెళ్ళుతాను. ఐతే విషధరుల నందరినీ సంహారము చేసి మానవకోటిని కాపాడవలసిన భారము అమృతమూర్తివైన నీ మీద ఉన్నది, మహారాజా ! [కన్నీరు ధారగా కారుస్తాడు.]

సోమశ్రవసుడు

ఈ చిన్నవాని ప్రార్థన నీ సర్పస్వప్నము సార్థకమని సూచిస్తున్నది, రాజా!

జనమేజయుడు

వేరు చింత ఎరుగని మా మనస్సును చిన్నతనమునుంచీ సర్పవైర మెందుకోగాని కలత పెట్టుతుంది. ఆ వైరాంకురానికి నీ విప్పుడు కారుస్తున్న ప్రతి కన్నీటి బిందువూ పుష్టి కలిగిస్తున్నది, నాయనా!

రురుడు

అర్థులపాలిటి కల్పవృక్షమ వని నిన్నాశ్రయించిన నా కోరిక ఈడేరినట్లే. ఇక నా ప్రమద్వరను సంపాదించుకో బోవలె, సెలవియ్యి మహారాజా!

జనమేజయుడు

మంచిది.

మంత్రి

ఈ కాలపు కుర్రవాళ్లలో ఎంతటి మాధుర్యమూ ఎంత కాఠిన్యమూ మిశ్రమై ఉన్నవీ!

[తెరలో] దౌవారికుడు

నిజవిజయ దుందుభిధ్వాన నిరత చకిత

భోగిలోకపర్యంత భూభుజ సమాజ!
బాడబుడు జనమేజయ పార్థివేంద్ర!
వేచి యున్నాఁడు రోషాగ్ని లోచనుండు.

జనమేజయుడు

త్వరగా రమ్మను.
[రురుడు నిష్క్రమిస్తున్నప్పుడే ఉదంకుడు ప్రవేశిస్తాడు. ఉభయులు ఒకరి ముఖము ఒకరు చూచుకుంటారు.]

ఉదంకుడు

అమృతకిరణు వంశంబునం దవతరించి
ధాత్రి పాలించుచున్నావు ధారుణీశ!
విషధరుల బాధ పడలేక వేగుజనుల
శీఘ్ర మభయం బొసంగి రక్షింతు గాత!
నేను ఉదంకుడను మహారాజా!

జనమేజయుడు

నేడు బ్రాహ్మణోత్తము లంతా సర్పతాపము అభిలషిస్తున్నట్లున్నారే. నీ కోపాగ్నికి ఇంధనమైన విషధరు డెవరు భగవన్?

ఉదంకుడు

కుటిలవర్తను డైన నాగరాజు.

జనమేజయుడు

తక్షకుడు నీ కేమి అపకారము చేయగలిగినాడు, బాడబోత్తమా!

ఉదంకుడు

వజ్రికి మిత్రులైన పైలులు మా గురుదేవులు, రాజా! నేను విద్యాభ్యాసము సమాప్తి చేసుకొని గురుదక్షిణ ఏమైనా స్వీకరింపవలసినదని మా గురుదేవులను అర్థించినాను, స్వామీ! గురుపత్ని బ్రాహ్మణసంతర్పణ చేయ తలపెట్టి నన్ను పౌష్య మహాదేవి కుండలములు నాలుగోనాటికి తెమ్మని ఆజ్ఞాపించింది. నేను మహాప్రసాద మని వెంటనే బయలుదేరినాను.

జనమేజయుడు

ఎంతకాలముగానో తక్షకుడా కుండలములు ఆపేక్షించి అపహరించవలెనని యత్నిస్తున్నట్లు విన్నామే — ఐతే ఏమైనది భగవన్ ?

ఉదంకుడు

ఆ తల్లి, ఆ పౌష్యుని మహాదేవి నేను అడిగినదే వ్యవధానంగా తన కుండలములు నాకు అనుగ్రహించింది, రాజా! ఆ అమ్మ మహాపతివ్రత. తక్షకుని మాయాబుద్ధి కూడా నాతో ప్రశంసించింది. నన్ను మోసగించడము ఆ తక్షకుని తరమా, అంటూ సెలవు పుచ్చుకొని శీఘ్రమే తిరిగి వస్తున్నాను. ఐతే—

జనమేజయుడు

అపరాగ్నిహోత్రుడ వని తెలియక నిన్నే తక్షకుడు చెనక సాహసించినాడా ?

ఉదంకుడు

నే నెంతవాణ్ణి, మహారాజా! మా గురుదేవులు మహేంద్ర మిత్రులు. వారి కటాక్షమే అంతా, ప్రయాణప్రారంభ సమయములోనే ఒకానొక దివ్యపురుషుడు తెల్లని మహోక్ష మెక్కి ఎదురై నన్ను అమృతమయ మైన గోమయము భక్షింప చేసినాడు. ఆ శుభశకునఫలమే స్వామీ! లేకపోతే రాజ పురుషులు చేసే దుండగాలకు అసహాయులైన మాబోటి బ్రాహ్మ ణులు ఏమి చేయగలరు మహారాజా!

జనమేజయుడు

మీకు మానవమాత్రుల సహాయముతో ఏ మవసరము! బ్రహ్మతేజస్సు ఉట్టిపడే నీ బోటివాళ్ళ కోరికలు తీర్చటానికి దేవతలే ఎదురు చూస్తూంటారు. నీ కోరిక పుట్టినదే వ్యవధా నంగా సఫల మవుతుంది, బ్రాహ్మణోత్తమా!

ఉదంకుడు

తథాస్తు! మహారాజా, తథాస్తు! ఆశ్రిత చింతామణి వైన నిన్ను చేరినవారి కోరికలు సఫలము కాక మరే మవుతవి!

జనమేజయుడు

తక్షకుడు ఐతే నిన్నేమి చేసినాడు?

ఉదంకుడు

ఆ కుండలాలు తీసుకొని త్వరత్వరగా వస్తూ ఉండగా దారిలో

స్వచ్ఛమైన జలాశయ మొకటి కనిపించింది. అది చూడగానే ఎందుకో ఎన్నడూలేని దాహమయింది.

జ న మే జ యు డు

తక్షకుడు నీలో ఏమైనా ప్రవేశించినాడేమో!

ఉ ద ం కు డు

ఏమోకాని మహారాజా! నే నంతట కుండలములు ఒడ్డున ఉంచి చెరువులో దిగినాను. వెంటనే దిగంబర సన్యాసి ఒకడు ఆ కుండలములు ఎత్తుకొని పారిపోతున్నాడు.

జ న మే జ యు డు

ఎంత పనిచేసినాడు! అంత సాహసు డెవరు!

మ ం త్రి

మణినాథు డైన నాగరాజు దిగంబర భిక్షువుకూడా ఐనాడా!

ఉ ద ం కు డు

అవును, నాకు వెంటనే పౌష్యరాణి మాటలు జ్ఞాపకము వచ్చి వాడు తక్షకుడే నని నిశ్చయించి వెంట తరిమి పట్టుకున్నాను. తక్షకుడు చప్పున మాయవేషము మాని నిజరూపంతో నా పట్టులోనుంచి జారదీసుకొని అక్కడ ఉన్న కలుగులో జొర బడి పాతాళానికి పారిపోయినాడు.

జ న మే జ యు డు

అబ్బా, సర్పరా జెంత నీచుడు! బ్రాహ్మణ ద్రవ్యము దావానల

మని వానికి తెలియలేదు కాబోలు! ఐతే నీవు పాతాళానికి వెళ్లినావా?

ఉదంకుడు

నాకు కోపముతో ఒళ్లు తెలియ లేదు. నా దండముతోనూ వేళ్లతోనూ గోళ్లతోనూ బలముకొద్దీ ఆ కలుగు త్రవ్వినాను. ఎంత రోషముతో తవ్వినా ఎంతసేపు త్వవ్వినా అందులో ఎక్కువ అవకాశ మేర్పడలేదు. వేళ్లు నెత్తురు వరదలు కారినవి. గోళ్లు చీలుకొని పోయినవి. నా దేహము నిస్సత్వమయింది. దాహము దుర్భర మనిపించింది. — అంతట మా గురుస్వాములను ఒక్కసారి ధ్యానించి నమస్కరించాను. — మళ్లీ ఆ కలుగు తవ్వడం ప్రారంభించాను. ఏమి చెప్పను రాజా!

జనమేజయుడు

బ్రహ్మచారికి గురువే పరదైవము కదా!

ఉదంకుడు

వెంటనే నా శరీరంలో అపూర్వమైన సత్వమేమో ప్రవేశించింది. నా దండమూ వేళ్ళూ గోళ్ళూ వజ్రతుల్యా మైనవి. క్షణమాత్రములో పాతాళ లోకముదాకా గొప్ప వివర మేర్పడ్డది. దానివెంట నేను పాతాళలోకము ప్రవేశించాను.

జనమేజయుడు

ఆహా, నీవు సిద్ధసంకల్పుడ వయ్యా!

ఉ ద ం కు డు

అక్కడ సర్పప్రభువులు బుసలు కొట్టుతూ రాజులై సంచరిస్తూ న్నారు. నేను బ్రాహ్మణుణ్ణి ఏమి చేయనూ తోచక నా కుండలాలు నా కిమ్మని సర్పలోకము నంతటినీ యాచించినాను, రాజా — నా ప్రార్థన వారు పెడచెవిన పెట్టినారు. నేను చేసిన సర్పస్తోత్రా లన్నీ వ్యర్థమైనవి.

జ న మే జ యు డు

నీబోటి సద్బ్రాహ్మణుల శాపవాక్కు వజ్రభయంకర మైనట్లే స్తోత్రవాక్కు అమృతమధురము కదా!

ఉ ద ం కు డు

అమృతము ఎదట ఉంచినా తాగలేక పోయిన ఆ రెండు నాలి కలవాళ్ళు స్తోత్రాలతో వశు లవుతారా? దండమే దశగుణము. ఒకవైపున ఉపాధ్యాయాని ఆజ్ఞాభంగభయమూ, మరొకవంక తక్షకుని మీదను నాగలోకముమీదనూ ఆగ్రహమూ, — ఈ రెంటితో తపిస్తూఉన్న నాకు అప్పు డక్కడ గొప్ప గుఱ్ఱమెక్కి తేజస్సు ఉట్టిపడుతున్న పర్జన్యమూర్తి ప్రత్యక్ష మైనాడు. ఆ మహానుభావుడు నా మొర విని తన అశ్వకర్ణముచూపి దాన్ని మోయించ మన్నాడు.

జ న మే జ యు డు

సత్పురుషుల కోరికలు తీర్చటానికి దేవతలు ఎక్కడా కాచు

కొనే ఉంటారు.

ఉదంకుడు

నే నా దివ్యపురుషుని ఆజ్ఞ శిరసానహించగానే ఏమి మహాద్భుతము జరిగిందో తెలుసునా, మహారాజా! ఆ అశ్వకర్ణములో నుంచి అగ్నిజ్వాలలు బయలు వెడలినవి. ఆ శబ్దము వ్యాపించిన వేగముతోనే గొట్టములోనుంచి చిమ్మినట్లు పాతాళమంతా ఆ అగ్నిజ్వాలలు వ్యాపించి నిండిపోతున్నవి. ఆ మహాగ్నితో సర్పకులప్రళయమయ్యేదేకాని——

మంత్రి

తక్షకుడు పాదాక్రాంతుడైనాడా?

ఉదంకుడు

పరుగు పరుగున వచ్చి కుండలాలు నాకు మళ్లీ ఇచ్చి వేసినాడు. ఆ మహాగ్ని నెమ్మదిగా శాంతించింది.

జనమేజయుడు

మేలు, మహాశయా, మేలు!

సోమశ్రవసుడు

ఆ అగ్నిహోత్రుడు తనను ఉపాసన చేసేవారి కోరికలు తీరుస్తూ ఉంటాడు.

మంత్రి

ఈ బ్రాహ్మణుడు స్థిరబుద్ధి!

ఉదంకుడు

అదంతా మా గురుదేవుల కటాక్షమూ, ఆ దివ్యపురుషుని అనుగ్రహమూ, ఆ అశ్వమూర్తి భిక్షా, — అంతట వారికి నమస్కరించి మా ఉపాధ్యాయాని ఆజ్ఞ నిర్వర్తించి ఆమె ఆశీర్వాదము పొందగలిగినాను. మా గురుదేవులు నాకు సెల విచ్చి పంపగానే దుష్టభుజంగమశిక్షణము యాచించడానికి మహారాజు వని నీ వద్దకు వచ్చినాను. ఆ పర్జన్యుని అశ్వకర్ణములో నుంచి ఉత్పన్నమై శాంతించిన అగ్నిని నీవు మళ్ళీ రగుల్చవలె మహాప్రభూ !

జనమేజయుడు

ఒక్క తక్షకుడు చేసిన తప్పుకు సర్పకుల మంతా దండించ మనడము న్యాయమా, భగవన్ ?

ఉదంకుడు

నీ కా సంశయ మెందుకు మహారాజా, తక్షకు డేలాటివాడో వాని కులమంతా అంతే! అందరిదీ వంకరనడకే, నిలువునా విషమున్న విషపు పుచ్చెలు వాళ్ళు! ఒక్కొక్కరికీ నాలికలా రెండు. జీవనార్థము గాలి ఐనా మేస్తారు. ఇక వాళ్ల ధనాశ అపరిమిత మయింది. తమకు లోకువైన వాళ్లవద్ద మాత్రము తమంతవాళ్ళు ఎవరూ లేనట్లు తలలెత్తి ఆడుతూ బుసకొడతారు. అనువుకానప్పుడు కలుగుబులోకి జారబారుతారు. వాళ్లను దుంపనాశనము చేయవలె. ఒక్క కులపాంసనుడు చేసిన

తప్పువల్లనే కులమంతా దూష్యమవుతుంది గదా, వీళ్ళు అందరూ జగత్తుకు అపకారులే !

జ న మే జ యు డు

నీవు వచ్చే ముందే రురుడు తనకు కలిగిన సర్పబాధ మనవి చేసినాడు. నీవు తక్షకుని దురంతము వర్ణిస్తున్నావు. మాకు ప్రకృతి సిద్ధముగా సర్పవైర మున్నది. ఆత్మవిరోధాలు సాధించుకోడానికి రాజదండము ప్రయోగించ వచ్చునా! — అదిగాక నాగరాజు సామంతుడు కాడు. మాకు స్వీయముగా ప్రబలమైన విరోధకారణము లేనిది పరరాజుమీద దండు పోవడము ధర్మమా అని సంశయిస్తున్నాము.

ఉ దం కు డు

మహారాజా! మహారాజా ! నీకే తక్షకునితో ప్రబల విరోధ కారణము లేకపోతే ఈ లోకంలో మరెవరి కుంది ?

జ న మే జ యు డు

ఏమి టేమిటి !

ఉ దం కు డు

పరమ భాగవతులైన పరీక్షితులు పరమపదించినప్పుడు నీవు పసివాడవు కాబోలు !

జ న మే జ యు డు

అవును. అయితే! — నీ మాటలు బోధపడక మా మనస్సును ఊరికే కలవర పెట్టుతున్నవి.

ఉ ద ం కు డు

నీకు మీ పితృదేవుల మరణకారణము తెలును సనుకున్నాను, మహారాజా ! మంత్రులు నీకు తెలిపి ఉంటా రనుకున్నాను.

జ న మే జ యు డు

మంత్రి మహాశయా ! —?

మ ం త్రి [తొందరగా]

స్వామీ, ఈ బ్రాహ్మణుడు సెలవిచ్చేది సత్యమే. రాజులకు అనవసరముగా అప్రియము నివేదించడము రాజపురుషులకు అనుచిత మని నేను నివేదించలే దిన్నాళ్లూ !

ఉ ద ం కు డు

భాగవతోత్తములైన పరీక్షితులు శ్రీ శుకయోగివల్ల భగవత్ శాస్త్రోపదేశము పొందిన బ్రహ్మానందంలో ఉండగా ఈ తక్షకుడు బ్రాహ్మణవేషముతో నాగులను పంపి మీ పితృదేవులకు మృత్యువైనాడు.

మ ం త్రి

మహారాజా, ఆగ్రహించబోకు ! ఈ బ్రాహ్మణుడు సత్యమే చెపుతున్నాడు. పరీక్షిన్మహారాజు దర్శనార్థము బ్రాహ్మణవేషముతో కొందరు నాగులు వచ్చి ఫలాదుల పంపినారు. అందులో ఒక చక్కని పండులో అల్పక్రిమిరూపంగా తక్షకుడు అణగిఉండి బయలుదేరి శీఘ్రమే మహాసర్పమై మహారాజును

కంఠప్రదేశములో కరిచి అదృశ్యుడైనాడు.

జనమేజయుడు

అయ్యో, మన రాజ్యములో సర్పవిషము చికిత్సచేసే వైద్యులూ మాంత్రికులే లేకపోయినారా!

మంత్రి

ఉన్న వైద్యులూ మాంత్రికులూ అంతా అక్కడే ఉన్నారు. అయితే ఆ తక్షకవిషాగ్నికి చికిత్స ఎక్కడిది! తండ్రిగారున్న ఏడంతస్థుల ప్రాసాదము కూడా ఆ విషాగ్నికి కూలి భస్మమై పోయింది. తక్షకవిషాగ్నికి చికిత్సకులు లోకంలో లేరు స్వామీ!

ఉదంకుడు

మంత్రుల మాటకు అడ్డము వచ్చినందుకు మన్నించ గోరుతాను. కశ్యపుడనే బ్రాహ్మణోత్తముడు తక్షక విషహతులను కూడా బ్రతికించగల సంజీవనీవిద్య బ్రహ్మవల్ల ఉపదేశము పొందినాడు.

మంత్రి

ఈ బ్రాహ్మణుడు మహారాజుకు క్రోధాగ్ని ప్రజ్వరిల్ల జేస్తున్నాడు. మహారాజు మూర్తి అంతకంతకు క్రోధదుర్నిరీక్ష మవుతున్నది!

ఉదంకుడు

ఆ కశ్యపుడు పరీక్షితులను సంజీవింపజేయడానికి హస్తిపురము

వస్తున్నాడు. ఇది తెలిసి తక్షకుడు వృద్ధబ్రాహ్మణ రూపముతో కశ్యపునికి ఎదురై ఏపనిమీద వెళ్ళుతున్నా వని అడిగినాడు. కశ్యపుడు తసపని చెప్పినాడు. అంతట ఆ నాగరాజు 'నేనే తక్షకుణ్ణి, నా విషముతో దగ్ధమైనవారికి చికిత్సలే' దన్నాడు.

మంత్రి

మహారాజు తక్షకనాశనముకు దీక్షితు డవుతున్నాడు. ఈ పరమశాంతమూర్తి భ్రుకుటి ఎంత భయంకరముగా ఉన్నది!

ఉదంకుడు

అంతట ఏమిజరిగిన దంటే, మహారాజా,—వా రుభయులూ ఎవరి శక్తి వారు ప్రదర్శించుకున్నారు. తక్షకుడు అక్కడ ఉన్న వటవృక్షము కరవగా ఆ విషానికి అది భస్మమైపోయింది. కశ్యపుడు శాంతముగా ఆ భస్మ మంతా పోగుచేసి తన మంత్ర శక్తివల్ల ఎప్పటివలే ఆ చెట్టును బ్రతికించాడు. తక్షకుడు కశ్యపుణ్ణి బ్రతిమాలుకొని పరీక్షితు లిచ్చే ధనముకంటె తానే అధికధన మిచ్చి పరీక్షితుల వద్దకు రాకుండా వచ్చిన దారిన తిరిగి పంపించి వేసినాడు.

మంత్రి [అవిశ్వాసముతో]

ఈ కథ అత్యద్భుతముగా ఉన్నదే! మా కెవ్వరికీ తెలియని ఈ రహస్యకథ నీ కెలా తెలిసింది స్వామీ?

ఉదంకుడు

నే నప్పుడు నూతనోపనీతుణ్ణి. ఈ సంవాదము జరిగినప్పుడు

నేను గురుపత్ని ఆజ్ఞాప్రకారము ఆ వటవృక్షముమీదనే సమిధలు సంగ్రహిస్తూ ఉండి తక్షక విషముతో భస్మమయి మళ్లీ కశ్యప మంత్రముతో బ్రతికినాను.

[సభలో కొంతసేపు నిశ్శబ్దము]

జనమేజయుడు

అయితే మాకున్న సర్పవిరోధము అకారణము కాదన్నమాట.

ఉదంకుడు

తక్షకునివల్ల మీ తండ్రిగారికి దుర్మరణము ప్రాప్తమయింది. సర్పదంశమువల్ల మరణమూ, అందులో అంతరాళములో సంభవించడమూ —

మంత్రి [భయముతో]

భగవన్ !

ఉదంకుడు

రాజా, మీ తండ్రిగారికి ఉత్తమగతి కల్పించవలె నంటే—

జనమేజయుడు

సర్పకులానికి ప్రళయము పుట్టించవలసిందే! అందుకు ఉపాయ మేమిటి ?

ఉదంకుడు

నాగమాత కద్రువ నాగకులము జనమేజయుని సర్పయాగంలో

దగ్ధ మవుతుందని శపించింది, మహాప్రభూ! ఆ దుర్మార్గులు వాళ్ల కన్నతల్లికే బరువై పోయినారు.

మం త్రి

సోమశ్రవసులు ఏమి సెలవిస్తారో!

సో మ శ్ర వ సు డు

జనమేజయ చక్రవర్తికే సర్పసత్రము చేయడము చెల్లుతుంది —ఆ యాగవిధి, నీవు నిర్వర్తించడానికే పుట్టింది, మహారాజా!

జ న మే జ యు డు

నన్ను శీఘ్రమే సర్పయాగదీక్షలో ప్రవేశించేట్లు ఈ సదస్యులు అనుగ్రహిస్తారు కాక!

ఉ దం కు డు

జయ జయాఖిలదుష్టశిక్షణధురీణ,
సర్పసత్రాభిదీక్షిత, సాధుపక్ష,
పూజిత బ్రాహ్మణాభీష్ట పుణ్యమూర్తి,
జయము, జనమేజయప్రభూ, జయము జయము.

సోమశ్రవసుడు, మంత్రి, పారిషదులు

తథాస్తు! తథాస్తు!

జ న మే జ యు డు

ఈ పరిషదనుజ్ఞ, మహాప్రసాదముగా శిరసావహిస్తున్నాను.

సోమశ్రవసుడు

ఆ విషజీవులు మాతృశాపమువల్ల ఎప్పుడో దగ్ధులై పోయినారు. నీవు చేసే సర్పయాగము అందుకు నిమిత్తమాత్రమే అవుతుంది.

జనమేజయుడు

ఈ అపూర్వయాగ భారమంతా పురోహితులమీదనే ఉంచుతున్నాము.

సోమశ్రవసుడు

మహారాజు ఆజ్ఞాపించినట్లే! ఈ యాగము అద్వితీయమైనది. ఈ కర్మకు అప్రతిద్వంద్వుడవైన నీవే తగినవాడవు. ఇందుకు అనన్యసామాన్యులైన ఉత్తమస్థుల నందరినీ పిలిపించవలె. చండ భార్గవుడైన ఈ ఉదంకుడే హోత, పింగళుడు అధ్వర్యుడు, బ్రహ్మ శార్ఙ్గరవుడూ, కౌత్సుడు ఉద్గాత, వ్యాసాది మహర్షు లంతా సదస్యులుగా ఈ మహా సత్రము, దేవీమఖ పురస్సర ముగా ఆరంభించవలె. దీనివల్ల నీకీర్తి ఆచంద్ర తారార్కమూ త్రిలోకవిఖ్యాత మవుతుంది.

జనమేజయుడు

ఈ తక్షక విషాగ్ని పూజ్యులైన మా పితృదేవులను ఏరీతిగా దహించిందో, ఆరీతిగానే సత్రాగ్ని తక్షకకులాన్ని దహించి భస్మము చేసినప్పుడే గాదా, నా పితౄణము తీరేది స్వామీ!

ఉదంకుడు, సోమశ్రవసుడు, పారిషదులు

జయము, మహారాజా, జయము!

[ఘంటానాదము వినవస్తుంది]

[తెరలో] దౌ వా రి కు డు

అగ్న్యగారంబునందు క్షుధార్తు డట్లు
శిఖి ప్రదక్షిణ శిఖల నుచ్చైత్రము నయ్యో
దరిసె పరదేవతార్చనా తరుణ మనుచు
కలయ మ్రోగె ఘంటాఘణత్కారము లవె!

[ తె ర ]

## రెండవ అంకము

[నాగలోకములో సభాగృహము. సర్పముఖ్యులు కొందరు వచ్చినారు.]

ఒ క రు

తల్లి శాపమే లేకపోతే మనకీ అవస్థ పట్టదుగదా!

ఒ క రు

ఎవరి శాపానికైనా తిరుగు ఉంటుంది కాని తల్లి శాపానికి ఉండ దంటారు.

ఒ క రు

కొండలలోనూ అరణ్యాలలోనూ నిర్భయంగా సంచరించే

మనకు అందుకనేగదా ఈ కలవరం పుట్టింది!

ఒకరు

అయితే ఈ సభకు ఆదిశేషువు వచ్చేనా?

ఒకరు

శేషు డెందుకు వస్తాడు? అతను మొదటినుంచీ జాగ్రత్త మీాదనే ఉన్నాడు.

ఒకరు

శత్రువులను ఆశ్రయించి బ్రతికే ఆ బ్రతుకుమాత్రమేమి బ్రతుకు!

ఒకరు

భూమి అంతా ఒక్కడూ మోస్తున్నాడు. ఆ దేహబలమంతా మనతో చేరిఉంటే ఎంత ఉపయోగంగా ఉండేది!

ఒకరు

ఆ బానిసతనం చేస్తున్నా, శేషుని కళ ఏ మాత్రము తగ్గిపోలేదు.

ఒకరు

ఆ వెయ్యి పడగలమీాదనూ ఈ ప్రపంచ మంతా బంతివల్లే ధరించి క్రీడిస్తున్నాడు, ఆ మహానుభావుడు!

ఒకరు

శత్రువుల మెతుకులు శేషునికి వంటపట్టినవి!

ఒకరు

అయితే పాపము, తల్లిశాపము విని బ్రహ్మకోసము తపస్సు చేసిన రోజుల్లో అతని దేహము చిక్కిపోయి 'ఎలా ఉండేదో' జ్ఞాపక మున్నదా!

ఒకరు

అవును. బ్రహ్మ కోసము కొన్నాళ్ళు గంధమాదనము మీదా, మరి కొన్నాళ్ళు బదరీవనంలో, ఇంకా కొన్నాళ్ళు గోకర్ణం లోనూ, వేరే కొన్నాళ్ళు పుష్కరారణ్యంలో, ఇంకా హిమ వత్తటంమీదా, — ఇంకా ఎక్కడో ఎక్కడో ఉగ్రతపస్సు చేశాడు.

ఒకరు

అప్పుడాయన ఒళ్ళంతా జడలు కట్టిపోయింది. ఆహారం లేక మాంసము ఎండి ఎముకలకు చర్మము అంటుకు పోయింది.

ఒకరు

పాపము బ్రహ్మనుగురించి తపస్సు చేస్తే ఏమికాని అతను ఆ గరుత్మంతునితో స్నేహం చేస్తున్నాడు. అది మనబోటివాళ్ళకు తలవంపులుగా ఉంది!

ఒకరు

దాసీపుత్రునితో చెలిమివల్ల దాస్యం తప్ప మరే మబ్బుతుంది!

ఒకరు

మీరెవ్వడన్నా చూచారో లేదోగాని, మన అగ్రసోదరుడైన

శేషుడున్నూ, మన దాసీపుత్రుడైన వైనతేయుడున్నూ, ఆ విష్ణువుకు దాస్యం చేయడానికి నేనంటే నేనని వంతులు పోతుంటే ఆ విచిత్రం చూడాలి!

ఒకరు [వెకిలినవ్వుతో]

ఆ పోటీలో మన శేషుడే నెగ్గినట్లుంది. దాస్య భావానికి వైష్ణవులు అందుకనే శేష భావమని పేరు పెట్టినారు.

ఒకరు

మన పెద్దన్న వట్టి పెద్దన్న అయిపోయినాడు.

ఏకరు

జేష్ఠు డెప్పుడూ మూఢు డవుతా డంటారు.

ఒకరు

మొదటినుంచీ ఆ శేషుడు మందబుద్ధి. మనతో కలిసేవాడు కాదు. దూరదూరంగానే ఉండేవాడు.

ఒకరు

అయితే తీక్ష్ణబుద్ధి ఐన వాసుకికి ఈ కర్మ మేమిటి!

ఒకరు

సముద్రమథనమప్పుడు ఆ వాసుకి పడ్డబాధ ఆ పరమేశ్వరునికే ఎరుక!

ఒకరు

చివరకా అమృతబిందువు ఒకటి వాసుకి తలమీద కాస్త పడబట్టి కాని, లేకపోతే ఈ సర్పయాగం దాకా ఉండేవాడు కాడు; అప్పుడే అయిపోయి ఉండవలసింది.

ఒకరు

సముద్రమథన మప్పుడు చిలికి చిలికి ఇటు దేవతలూ అటు రాక్షసులూ సరిగ్గా అమృతం పుట్టే వేళకి అట్టే సొమ్మసిల్లి పోయినారు! మందరాద్రి మన వాసుకి ఒరిపిడికి పాపము, సదుముకు కోతపడి పోయింది. ఇక మన వాసుకి ఏమో, నలిగి పోయిన దీర్ఘదేహ మంతా ఒక్కసారి అట్లా సరిచేసుకొని ఫూత్కరిస్తూ పడిపోయినాడు.

ఒకరు

అబ్బా, అప్పుడు వాసుకి కక్కిన విషమేనా! ఆ మంటకే సగంమంది రాక్షసులు నాశన మైనారు. చివరకా పరమేశ్వరుడు ఒక్కడూ అడ్డం రాకపోతే ఒక్క పురుగన్నా మిగలకుండా మనుష్యలోక మంతా అప్పుడే నాశన మయ్యేది.

ఒకరు

ఇప్పుడా విషమంతా పోయింది గనుకనే సాంబశివుని దేహాన అలంకారప్రాయు మైనాడు. ఇప్పుడాయన ఆడించిన ఆటల్లా

ఆడుతాడు; పాడించిన పాటల్లా పాడుతాడు.

ఒకరు

ఆ విషం పోతే అట్లా ఐపోతారు మరి!

ఒకరు

మనకు ప్రాణమే విష మాయెను!

ఒకరు

అయితే ఆ వాసుకికి మునుపుండే విషము ఇప్పుడు మన తక్షకునికి కూడా లేదు.

ఒకరు

సముద్ర మథనానికి పూర్వము వాసుకి శరీర మెప్పుడూ చుంయి చుంయి మని విషము కక్కుతూ ఉండేది!

ఒకరు

ఆ మహానుభావుని వంటిమీద విషపుమంటలు ఊటలవలె ఊరికే ఉబకడమే.

ఒకరు

ఇప్పుడు మన కందరికీ ఉద్దేశాలే కాని వాసుకీ వాళ్ల సామర్థ్యాలు ఎక్కడినుంచి వస్తవి!

ఒకరు

ఆ వాసుకి ఇప్పుడు నాగరాజ్యముకంటె శివుని శిరస్సుమీద

నాట్యము చేయడమే గౌరవ పదవి అనుకుంటున్నాడు.

ఒ క రు

ఎట్లా అయినా ఆదిశేషువుకంటె వాసుకే కొంత నయము. అన్నాళ్లూ అంత ఘోరతపస్సు చేసి ఆదిశేషువు సాధించింది విష్ణువును మోసే పడక కావడమే. అంత అవస్థపడ్డా చివరకు వాసుకి శివుని శిరస్సుమీది కైనా ఎక్కగలిగినాడు.

ఒ క రు

వాసుకి అదే పెద్ద పదవి అనుకుంటున్నాడు.

ఒ క రు

ఆ బ్రహ్మానందంలో మన అవస్థ ఆ వాసుకి నెత్తికి ఏం ఎక్కుతుంది!

ఒ క రు

అయితే వాసుకి ఈ సభకు రా డన్నమాటే!

ఒ క రు

పెద్దవాడు శేషుడూ రాక, తర్వాత వాడు వాసుకీ రాకపోతే, ఇక మనకు ఎవరూ దిక్కు!

ఒ క రు

ఎవరికి వాళ్ళము ఏదో ఒక పెద్ద అండ చూచుకోవడమే

బుద్ధిగా కనబడుతున్నది.

ఒకరు

వాళ్ళనూ వీళ్ళనూ ఆశ్రయించకపోతే ఆ జనమేజయచక్రవర్తినే ఆశ్రయించి బ్రతకకూడదనూ!

చాలామంది

ఛా! ఛా! ఛా! ఎవడా సిగ్గుమాలినవాడు!

ఒకరు

పోనీ మూలకారణం తక్షకుడేడీ?

ఒకరు

ఐరావతుడేడీ? — కౌరవ్యుడేడీ? — ధృతరాష్ట్రుడేడీ! — కాళీయుడేడీ?

ఒకరు

పేరుగలవాళ్లు ప్రళయం వచ్చేప్పటికి ఎవరి దారి వాళ్ళు చూసుకుంటారు. మనబోటి అనామకులకే అవస్థలన్నీ.

ఒకరు

నాకొక మంచి ఉపాయము తోస్తున్నది. మనలో కొందరము మారువేషాలతో పోయి ఆ మహారాజు వద్ద మంత్రులముగా చేరి ఆయన యజ్ఞము చేయకుండా ఉండేట్లు చేతాము.

ఒకరు

మరి కొంతమందిమి ఆయన ఋత్విక్కులలో చేరుదాము.

ఒకరు

బాగున్నది కాని వ్యవధాన మేదీ?

ఒకరు

ఇంత ఎందుకు? కామరూపులమైన మనకు అసాధ్య మే మున్నది! కొందరము కాలమేఘాలమై యజ్ఞ వాటికమీద కుంభవృష్టి కురిపించి యజ్ఞాగ్ని చల్లార్చి వేతాము.

ఒకరు

ఈ ఉపాయము అద్భుతంగా ఉన్నది. ఇంకా కొందరము రాత్రివేళ అందరూ నిద్రపోతున్నప్పుడు తెలియకుండా యజ్ఞ వాటికలో ప్రవేశించి స్రుగ్భాండము కాస్తా ఎత్తుకు వద్దాము!

ఒకరు

మరి కొందరము సంస్కరించిన పాత్రలలోనూ భోజనాది పదార్థాలలోనూ మూత్రపురీషాలు విసర్జించి అపవిత్రము చేతాము.

ఒకరు

దీని కంతా మూలకారణుడైన ఆ జనమేజయుణ్ణి, ఏ స్నాన శాలలో ఉండగానో, తండ్రిని కరిచినట్లే కరిచి చంపివేస్తే, ఎలా ఉంటుంది?

ఒకరు

బాగున్నది కాని మంత్రపూతుడై దీక్షితుడైన మూర్ధాభిషిక్తుణ్ణి

చేరబోగలమా !

ఒకరు

బ్రాహ్మణ శాపము లేకపోతే పరీక్షిత్తు మాత్రము వశుడయ్యేవాడా ?

ఒకరు

పోనీ, మనలో తీవ్రవిషం కలవాడొకడు సర్పసత్రప్రయోగము చేస్తున్న ఆ ఉపాధ్యాయుణ్ణే కరిచి చంపరాదూ ?

ఒకరు

ఒక్క ఉపాధ్యాయుణ్ణే ఏమిటి, యజ్ఞం చేయిస్తున్న ఋత్విక్కులను హోతలను ఉద్గాతలనూ అందరినీ ఒక్కపెట్టున కరిచి చంపివద్దాము.

ఒకరు

ఈ పనికిమాలిన యజ్ఞము చూదామని వచ్చిన సదస్యులనందరినీకూడా ఒళ్లంతా కరిచి కరిచి ముక్క ముక్కలుగా చీల్చివేతాము !

ఒకరు

అయ్యో ! బ్రహ్మహత్యలు తలపెట్టబోకండి నాయనల్లారా !

ఒకరు

అసలే మాతృశాపంతో దగ్ధులమైన మనకు బ్రహ్మహత్య కూడా తోడైతే దిక్కేమిటి ?

ఒ క రు

ఆ ఉదంకుని ద్రవ్యము హరిస్తే ఈ లోకంలో పుట్టిన మంటలు అప్పుడే మరిచిపోయినారురా !

ఒ క రు [పళ్లు కొరుకుతూ]

ఉదంకుడు !

ఒ క రు

ఆపద వస్తే దాని శాంతికూడా ధర్మమూలంగానే ఉండాలోయి.

ఒ క రు

బ్రహ్మఘ్నుల మైనాక బ్రతికి మాత్ర మేమి ప్రయోజనము !

ఒ క రు

అయితే బ్రహ్మహత్య అనీ, అధర్మమనీ, భయపడి అంతా పోయి ఆ యజ్ఞకుండంలో పడి చస్తామా ఏమిటి ?

ఒ క రు

మనని చంప దలచుకున్న వాళ్ల వద్దకూడా ఈ ధర్మ పన్నాలేనా?

ఒ క రు [నవ్వుతూ]

ఇది అసహాయోద్యమమే !

[తెరలో] దా వా రి కు డు

భోగిలోకాంచలముల ప్రభూత మయ్యె
ఘోర హుతభుక్ప్రభాళి అకారణముగ

వీరు లకుతో భయులు కాద్రవేయభటులు
ముగ్ధులైరి కర్తవ్యతామూఢు లగుచు

[సభ్యులలో కలవరము]

ఒకరు

ఏమై ఉంటుం దబ్బా కారణము!

ఒకరు

ఈ ఓరుగాలి ఎక్కడిదీ?

ఒకరు

నాలుక లిట్లా ఎండి పోతున్న వేం?

ఒకరు

ఒళ్ళు విరవిర లాడి పోతున్న దే?

ఒకరు

గుండెలు దడదడ లాడుతున్నవి.

ఒకరు

బుద్ధి ఎంత ప్రయత్నించినా ఏకాగ్రము కాకుండా ఉన్నది.

ఒకరు

మనస్సు ఇలా క్షోభపడుతున్నది ఎందుకు చెప్మా!

ఒకరు

లోపల అగ్ని ప్రవేశించినట్లుగా ఈ తాపంకూడా ఏమిటి!

ఒకరు

కాళ్లు వణికి పోతున్నవి. నిలవ లేకుండా ఉన్నాను.

ఒకరు

అయ్యో! [మూర్ఛపోవును]

[తెరలో] ద్వారికుడు

చలిత బడబాముఖోత్థితోచ్ఛ్వాసనతీవ్ర
భూరి ఝంఝానిలంబు నుద్భూత మయ్యె,
ఏచి వైశ్వానరజ్వాల లెల్లకడల
వరదలై పారె పాతాళవాసములను!

[సభ్యులలో కలకలము]

కొందరు

అగ్నులు చల్లార్చడానికి వారివాహకులు పోలేదా?

కొందరు

అగ్ని శమింపజేసేందుకు సాధనాలు తీసికొని అందరమూ పోదాము పదండి!

ఒకరు

మనము ఏదో ఆపద వస్తుందని దాన్ని నివర్తించుకోడానికి

మంతనమాడుతూ ఉంటే ఈ విపత్తు ఏమిటి?

ఒకరు

నాకు చూపుకూడా కనిపించడము లేదే!

ఒకరు

దిక్కే తెలియడంలేదు. ఎక్కడికి వెళ్ళగలము? ఏమి చేయగలము?

ఒకరు

ఇంద్రియాలన్నీ కంపించిపోతున్నవి.

ఒకరు

హృదయములో జ్వరబాధవలె ఏదో తాపము ప్రవేశించి వేధిస్తున్నది.

[తెరలో] ద్వారికుడు

ద్యోతమునరింప నేమొ ఆత్మోద్భవత్వ
మురక ఎందేని పుట్టు నీ హుతవహుండు;
ఇంధనము లేమి లేక ఎల్లెడలఁ బర్వె
తా ననర్థసంజ్ఞుడయి తనూనపాత్తు!

[సభలో సంక్షోభము]

ఒకరు

ఈ అకారణాగ్నికి మూలమేమై ఉంటుంది?

ఒకరు

మన తల్లికడుపున పుట్టడమే మనకీ అనర్థానికి కారణము.

ఒకరు

క్రూరబుద్ధి ఐన మాతృశాసనము చేయక ఉల్లంఘించడమే కారణము దీని కంతా!

ఒకరు

తల్లిగదా! ఆమె శాసించినది, ఒకవేళ అధర్మమే అనుకుందాము, అది నిర్వర్తించి ఉంటే సరిపోయేది.

ఒకరు

అప్పుడు ధర్మము ధర్మము అన్నవాళ్లే మనకొంప తీశారు.

ఒకరు

ధర్మాన్ని ఆశ్రయించినవాళ్లకు ఎన్నటికీ చెరుపు లేదంటారే, మరి ధర్మము కోసము మాత్రాజ్ఞ తిరస్కరించిన మనకీ శాపబాధ ఎందుకు రావలె!

ఒకరు

మాతృశాసనమే ధర్మము! మాతృశాసనము చేయ నీయకుండా మనకందరికీ అప్పుడడ్డు తగిలింది ఆ ఆదిశేషువే.

ఒకరు

అన్నీ ధర్మపన్నాలూ మనకప్పుడు చెప్పిన ఆదిశేషువే ఈ

ఆపత్కాలంలో మనలను విసర్జించాడు.

ఒకరు

అయిన దేదో ఐనది. మన మిప్పు డిక్కడ ఎందుకు కూడినట్లు!

ఒకరు

పోనీ, సాంబశివుణ్ణి ఆశ్రయించిన ఆనందంలో వాసుకి రాలేక పోతే పోవచ్చు గాని మన తక్షకప్రభువు ఏ మైనాడు ?

ఒకరు

పోనీ, హాస్తిపురానికి తక్షకుడు పంపిన వేగులవా రే మైనారో !

[తెరలో] దౌవారికుడు

బ్రహ్మ శార్ఙ్గరవుడు, చండభార్గవుండు
హోతగా నుండ, కౌత్సు డుద్గాత గాగ,
పింగళమహర్షి అధ్వర్యువిధి వహింప,
దీక్షితుం డయ్యె నంట పారీక్షితుండు

[సభలో కోలాహలము]

ఒకరు

ఏమి టేమిటి ?

ఒకరు

అయితే ఈ అగ్ని అంతా సత్రాగ్నే కావచ్చు.

ఒకరు

అందుకు సందేహమా ?

ఒకరు

మహారాజు తక్షకు డింకా రాలే దేమి ?

ఒకరు

అయ్యో, దిక్కులేని పక్షుల మైనాము !

ఒకరు

చేసిన కర్మ పరిపాకానికి వచ్చిన సమయాన దుఃఖించిన ప్రయోజన మేమిటి !

ఒకరు

తక్షకమహారాజును శీఘ్రంగా రమ్మని కబురు చేయండి !

ఒకరు

తక్షకు డెప్పుడూ ఇలా ఆలస్యం చేసి ఎరగడే !

ఒకరు

తక్షకునికోసము ఎవరైనా వెళ్ళినారా అసలు ?

ఒకరు

ఒకరితర్వాత ఒకరు ఇప్పటికి తక్షకుని కోసము వెళ్ళినవాళ్ళకు లెక్కే లేదు. ఆ వెళ్ళిన వాళ్ళలో ఒక్కరూ ఇంకా తిరిగి రాలేదు.

చాలామంది [ఒక్కసారి బిగ్గరగా]

తక్షకు డేడీ? తక్షకు డేడీ? — ఏడీ తక్షకుడు? — ఏడీ?

[తెరలో] దౌవారికుడు

హాస్తిపురవార్త విని యార్తి నాక్షణంబ
త్రాస సన్యస్తభోగిమై తక్షకుండు
తనువు వెల్వెల్లవారగా త్వరితగతిని
కదలె దేవేంద్రదిక్కు కేకాకి యగుచు!

[సభలో పెద్దపెట్టున రోదనము. అది శాస్త తగ్గినతర్వాత]

ఒకరు

అయ్యో! ఎంత మోసము జరిగింది!

ఒకరు

మనము ఉపాయా లిక్కడ ఆలోచిస్తూ కూర్చుండగానే అక్కడ సత్రసంకల్ప మై పోయిందే!

ఒకరు

మనగతి ఏమి టిక?

ఒకరు [మూలుగుతూ]

నాకు — నోట — మాట — రావడం — లేదు.

ఒకరు [మూలుగుతూ]

ఏదో ఆలోచన చెపుతా రంటే—ఊఁ!—పెద్దలు ఒక్కరైనా

ఇక్కడికి రాలే దేమిటి !

[తెరలో] ద్వారికుడు

తీక్ష్ణజిహ్వులు కాలాగ్ని దీప్తతనులు
విద్యుదుజ్జ్వల ఖడ్గపాశోద్యతోగ్రు
లెవ్వరో పట్టి బంధించి ఈడ్చుకొనుచు
పోదు రదె సర్పముఖ్యుల పౌదివి బలిమి !

[సభ్యులలో రోదనము ఎక్కు వవుతుంది. అది కాస్త తగ్గినతర్వాత]

ఒకరు

త్వరలో మనకూ ఆగదే పట్టుతుంది కాబోలు !

ఒకరు

అరాజకమైన ఈ దేశంలో మనకు దిక్కేముంది ?

ఒకరు

ఏనుగువంటి ఐరావతు డేడీ ?

ఒకరు

కొండవంటి కాళియు డేడీ ?

ఒకరు

కౌరవ్యు డేడీ ! ధృతరాష్ట్రు డేడీ ?

[తెరలో] ద్వారికుడు

పుత్రపౌత్రుల పరివార ముఖ్యముగను
తిగిచి కొంపోవగ కృశాను తీక్ష్ణభటులు
గ్రస్తులై మూర్ఛ నొంది రైరావతుండు
కాళియుడు ధృతరాష్ట్రుడు కౌరవ్యుండు.

[సభ్యులు ఒకటే దీనంగా ఏడుస్తూ నిట్టూర్పులు విడుస్తుంటారు]

ఒకరు

అయ్యో!

ఒకరు

అమ్మో!

ఒకరు

అబ్బా!

ఒకరు

అంతంత వాళ్లకే ఆగతి పట్టితే మన దేముంది ఇక!

[తెరలో] దౌవారికుడు

కోటిశుడు పూర్ణమానసుల్ కోణపుండు
కాలవేగుండు చక్రుండు కక్షకుండు
కాలుడు హాలీమకుండు ప్రకాలనుండు
శరణకలు లాది వాసుక్యులుకుల బడిరి.

[సభ్యులు దీనంగా ఏడుస్తూ నిస్సారంగా వింటూ నిశ్చేష్టులై

ఉంటారు.]

ఒకరు

నా బిడ్డ లేమైనారో బాబూ!

ౘకరు

నా భార్య ఓపలేనిది ఎట్లా ఉందో నాయనా!

[తెరలో] దౌవారికుడు

పిండసేక్త పుచ్ఛాండ రభేణకులును
శరభమండల కోచ్ఛిఖ శలకరులును
మూక బిల్వతేజ శ్శిలీముద్గరులును
భంగు డాదిగ తక్షకభవులు చనిరి.

[సభ్యులు పూర్వోక్తంగా ఏడుస్తూ ఉంటారు.]

[తెరలో] దౌవారికుడు

పారిజాతుండు హరిణుండు పాండకుండు
మోదుడు విహంగుడు కుశప్రమోదకులును
సంహతాప పారావత శరభముఖులు
బలిమి నైరావతోద్భవుల్ వశ్యులైరి.

[సభ్యులు పూర్వోక్తంగా ఏడుస్తూ ఉంటారు]

[తెరలో] దౌవారికుడు

ఏరకుడు కుండడును కుమారకుండు
ప్రాపరాతవేణీ స్కంథ బాహుకులును

శృంగబేరుడు వేణి యనంగ సుప్రవ
సిద్ధ కౌరవ్య కులజులు చిక్కవడిరి.

[సభ్యులు పూర్వోక్తంగా ఏడుస్తూ ఉంటారు]

ఒ క రు

ఇంకా ఉన్నావా శైవరు నాయనా ?

ఒ క రు

ఇంకా దుర్వార్త చెప్పడం కాలేదా ?

[తెరలో] దౌ వా రి కు డు

వీరణుండు పిఠార కుఠారకులును
మణియు కామఠ భైరవామలహారులును
అవ్యయుడు ముండవేదాంగు డాదిగాగ
ధార్తరాష్ట్రి మహానాగు లార్తి గనిరి.

[సభ్యులు పూర్వోక్తరీతిగా కొంతసేపు ఏడుస్తూ ఉంటారు.

ఒ క రు [నోరు తడి ఆర్చుకుంటూ]

ఎందుకోగాని ఈ మనోవ్యథ కాస్త తగ్గినట్లున్నదే !

ఒ క రు

జ్వలనతాపము తీవ్రతకూడా కొంత శాంతించి నట్లున్నది, ఏమి అదృష్టము !

ఒ క రు

ఈ ఓరుగాలికూడా మహాపర్వతము అడ్డుకున్న ప్రవాహజలము

వలె కొంచెము వెనకదారి పట్టుతున్న ట్లున్నది.

ఒ క రు

మళ్ళీ కళ్ళకు కాస్త చూపు కనబడుతున్న దే!

ఒ క రు

మన కెవరో ఉద్ధర్త అవతరించిన ట్లున్న దే! ఎవరో నీవు మమ్మొ రక్షించు మహాప్రభూ!

[తెరలో] దౌ వా రి కు డు

ఓడకుడు భోగులార, మి మ్ముద్ధరింప
అరుగుదెంచెడి నమరుల కమృతదాత
బలిమి నెదురీదుచు మరుత్ప్రవాహమునకు
పర్వ మంటల మ్రింగుచు వాసుకి అదె!

[సభ్యులు ఆశతో కాస్త తెప్పరిల్లు తుంటారు]

ఒ క రు

బ్రతికినాముగా బాబూ!

ఒ క రు

ఎంత కాలానికి ఈ కాస్త మంచిమాట పుట్టింది!

ఒ క రు

ఆత్మరక్షకోసము ఎన్నడో మనలను విసర్జించి పోయిన వాసుకి ఈ కష్టకాలంలో ఇక్కడికి తిరిగి రావడము వింతగా లేదూ?

ఒకరు

మనల నందరినీ పట్టి జనమేజయునికి అప్పగించి దానికి ప్రతిఫలంగా ఆత్మరక్షణ చేసుకోదలచి వస్తూ ఉండవలె!

ఒకరు

అంతే ఐ ఉంటుంది, సందేహము లేదు.

ఒకరు

మన ప్రభువు లెంతకైనా సమర్థులే!

ఒకరు

తక్షకుణ్ణి చూడలా, ఈ ప్రళయ మంతా మన నెత్తికిచుట్టి తాను పారిపోయినాడు!

ఒకరు

ఇన్నాళ్ళకు ఈ వాసుకి సిగ్గైన లేకుండా ఏ మని వస్తున్నాడో!

ఒకరు

ఏ ముఖం పెట్టుకొని ఇతను మన ముఖాలు చూడ గలడు!

ఒకరు

అతని శిరస్సులు బద్ద లయ్యేట్లు శిలావర్షము కురిపిద్దాము.

ఒకరు [కఠినంగా]

ఏమి దుష్టబుద్ధులురా మీరు?

ఒకరు

మన మింత ద్రోహులము కనకనే ఈ దురవస్థ సంభవించింది.

ఒకరు

జనమేజయుని యాజ్ఞికులు వాసుకి సహాయం లేకుండా మన లను బ్రహ్మాదండముతో ఆకర్షించ లేరా?

ఒకరు

ఇంతవరకూ లొక్కుపోయినవా ళ్లంతా వాసుకి వల్లనే పోయినారా ?

ఒకరు

ఆపత్కాలం వచ్చినట్లుగానే మనకు చివరకు మతులు కూడా పోతున్నవి.

ఒకరు

ఎటూ తోచకుండా ఉన్నది.

ఒకరు

ఇప్పుడు ఆపత్కాలం వచ్చింది కనకనే మనలను రక్షించడానికని ఆ మహానుభావుడు వేంచేస్తున్నాడు.

[వాసుకి దైన్యముతో ప్రయత్నపూర్వకముగా ముందుకు నడుస్తూ ప్రవేశించి సింహాసనము అలంకరిస్తాడు]

సభ్యులు [లేచి నమస్కరిస్తూ]

జయము, పన్నగలోకైక సార్వభౌమ!
తీక్ష్ణదంష్ట్ర, మహాకాయ, దీర్ఘజిహ్వ,

కాలకూటా, మహావేగ, కామరూప,
కావు మమ్ము, సుబ్రహ్మణ్యా, కావు మయ్యా!

వాసుకి

బహువాక్యములకు ఇది సమయము కాదు. ఇప్పుడు సంభవించిన సర్పప్రళయానికి ఉపశాంతి కొంత ప్రయత్నించి ఉంచినాను.

ఒకరు

ఏమిటది మహానుభావా?

ఒకరు

స్వామీ, నిన్ను ముందు ఉంచుకొని ఆ జనమేజయ మహారాజును ఈ క్రూరసత్రము విరమించమని ప్రార్థిస్తే మానకుంటాడా? దారితీయి ప్రభూ!

ఒకరు

ఇది నీవు మాకు ప్రసాదించవలె!

ఒకరు

మహారాజును సెలవీయనీయండి!

వాసుకి

ఈ కార్యసాధనకు సమర్థుడైనవాడు ఆస్తీకుడు. వాడు ధర్మబద్ధులైన నాగులను రక్షించగలడని విధించి ఉన్నది. అతన్ని

ఇక్కడకు పంపమని ఆయుష్మతి జరత్కారువును నియోగించి నాను. ఈ పాటికి వస్తూ ఉండవలె.

[తెరలో] ద్వా రి కు డు

నిజతనూరేఖ దిక్కు లున్నిద్రములుగ
భాస్కరుండో విధుండో వైశ్వానరుండో
కాక సాక్షా ద్విధాతయో కానగు నన
చేరె నిస్తంద్రధీరు డాస్తీకు డిదిగో !

వా సు కి

శీఘ్రముగా రమ్మను !

స భ్యు లు [సంతోషముతో]

బ్రతికినాము !

[ఏ మాత్రమూ తాపాది బాధ లేవీ లేకుండా నిర్లిప్తుడుగా నడుస్తూ ఆస్తీకుడు ప్రవేశము]

ఆ స్తీ కు డు

మామా, యాయావరీయుడను, ఆస్తీకుడను, అభివాదనము చేస్తున్నాను. [సాష్టాంగ దండప్రణామము చేస్తాడు]

వా సు కి

చిరంజీవ, ఆయుష్మాన్ ! జనమేజయ ప్రయుక్తమైన బ్రహ్మ దండబాధ పడుతున్న ఈ భోగుల దురవస్థ చూస్తూనే ఉన్నావు

కదా ! వీరి పీడ చూడగా నాకు కన్నీళ్ళు వరదలు కట్టుతున్నవి. గుండెలు దడదడ లాడుతున్నవి. స్వరముకూడా కంపిస్తున్నది. మనస్సులో జ్వరతాపము ప్రవేశించింది. మీ అమ్మ జరత్కారువు కర్తవ్యము విశదపరిచిందిగదా !

ఆస్తీకుడు [లేచి చేతులు జోడించి నిలుచుండి]

చిత్తము స్వామీ ! నీ ఆజ్ఞకోసము ప్రతీక్షిస్తున్నాను.

వాసుకి

నాయనా ! మా తల్లి కద్రువ శపించినప్పుడే ఏలా పత్రునివల్ల దాని శాంతి విని కశ్యపబ్రహ్మను ఉపాయము చెప్పమని ప్రార్థించినానోయి!

ఒకరు

రాజ వంటే దీర్ఘదర్శివైన నీవే స్వామీ !

ఒకరు

ఈ మహానుభావుణ్ణి ఎంతమందిమి ఎన్నివిధాలుగా నిందించినామోయి !

ఒకరు

ఏమి ఈ ఆస్తీకుని వినయ విధేయతలు !

వాసుకి

ఆయన ఆజ్ఞపొంది మీ తల్లి జరత్కారువును అతి వృద్ధురాలయ్యే వరకూ అవివాహితగా ఉంచినాము. తపోధనుడూ

అతివృద్ధుడూ ఐన జరత్కారు మహర్షి తన పితృదేవతల శాసనమువల్ల దార పరిగ్రహము చేయడానికి అంగీకరించినంతవరకూ ఆమెను ఉంచి, అప్పుడు ఆయనకోరిన కఠోరనియమాల కన్నింటికీ ఒప్పుకొని ఆయన కిచ్చి వివాహము చేసినాడోయి.

ఒకరు

ఆ వృద్ధుల వివాహము చూసి మనమంతా నవ్వుకున్న వాళ్లమే.

ఒకరు

ఇన్నాళ్లు ఉంచి చివరకు ఇంత వృద్ధు కిచ్చి చెల్లెలికి వివాహము చేస్తున్నాడు, ఈ వాసుకికి మతికూడా పోయిం దనుకున్నాము.

ఒకరు

పైగా ఆ బ్రాహ్మణుడు భార్యను నేను పోషించలే నన్నాడు.

ఒకరు

భార్య తనను ఎప్పుడు ఏమాత్ర మవమానము చేసినా లేచి పోతా ననికూడా భార్యతో సమయము చేసినా డంటారు.

వాసుకి

ఎలుక ఒకటి కొరకగా కొరకగా ఒక్క వేరు మాత్రము మిగిలి నిలిచి ఉన్న వీరణతృణస్తంభము అవలంబించి తల్రకిందులుగా వేళ్ళాడుతూ ఆదిత్య కిరణాలే ఆహారంగా తపస్సుచేస్తూ, కింద ఉన్న బురదగుంటలో పడడానికి సిద్ధముగా ఉన్నటువంటి యాయావర ఋషులను మీ పితృకులము వారిని నీ జన్మచేతనే

ఉద్ధరించినావోయి నీవు! ఇప్పుడు నీవు నీ మాతృకులమును
ఉద్ధరించవలసిన సమయము వచ్చింది!

ఒకరు

ఉభయకుల పవిత్రుడంటే ఆస్తీకుడే!

[తెరలో] ద్వారికుడు

స్థపతి యొక్కడు వాస్తు విశారదుండు
యజ్ఞవాటిక మాపనేయంబు గాంచి
సర్వ సంపన్నమయ్యు నీ సత్రము కడ
చనదు విప్రోత్తమ నిమిత్త మనియె నంట!

[సభ్యుల హర్షధ్వనులు]

ఒకరు

బ్రదకగలిగినాము!

ఒకరు [నిట్టూర్పుతో]

అమ్మా!

వాసుకి

నీ విప్పుడు శీఘ్రమే జనమేజయుని వద్దకు వెళ్ళి సర్పసత్రము
నుంచి అతడు విరమించేలాగు చేయవలె!

ఆస్తీకుడు

చిత్తము —

[అర్ధోక్తిలో తెరలో] ద్వారికుడు

స్థపతివాక్యంబులు స్మరించి క్షత్త జూచి
యజ్ఞవాటి నజ్ఞాతు లనుజ్ఞ లేక
చొరగ రామి శాసించి తా జొచ్చెనంట
పార్థివుడు దీక్ష బూన ప్రాగ్వంశమునను.

[సభలో కలకలము]

ఒకరు

అయితే మన ఆస్తీకుడు యజ్ఞవాటిక ప్రవేశించే దెట్లా?

ఒకరు

అయ్యో, ఈ ఆశకూడా కునుకుతున్న దీపశిఖవలె అంతరిస్తున్నదే!

ఒకరు

ఇటువంటి సద్బ్రాహ్మణులను యజ్ఞవాటికలోకి రాకుండా నిషేధించగలవాళ్ళుంటారా!

ఒకరు

ఇంతవరకూ శాంతించిన తాపము మళ్లీ కొంచెము ఎక్కువవుతున్నట్లున్నదే!

[తెరలో] ద్వారికుడు

త్రిపురదాహోద్యతుం డగు కృత్తివాసు
ఫాలనేత్ర సముద్భూత వహ్ని యట్లు

భుగ భుగని భూనభోంతరాపూర్ణ మగుచు
శుచిశిఖావలి ఈ సభ చుట్టుముట్టె !

[సభలో కలకల మెక్కువవుతుంది]

ఒకరు

అయ్యో, నా ఒళ్ళు మండిపోతున్నది !

ఒకరు

నా కళ్ళు తిరుగుతున్నవి.

ఒకరు

నా చెవులు దిబ్బెళ్ళు వేసుకు పోతున్నవి. ఏమీ వినబడడం లేదు.

ఒకరు

ఒళ్ళు అవశ మౌతున్నది.

[కొందరు మూర్ఛపోతారు]

ఒకరు

న న్నెవరో పిలుస్తున్న ట్లున్నది, వెళ్ళవలె! [నిష్క్రమణము]

ఒకరు

ఎవ రా పిలిచేది ! [నిష్క్రమణము]

ఒకరు

నా పేరేవతే ఉన్నదే! [నిష్క్రమణము]

[తెరలో] ద్వారికుడు

ఎరల గాంచి ఆశించి తా ముసల బడెడి
శకుని సంతానములు మత్స్యసమితు లట్లు
పరుగిడుదు రిదె వచ్చు నాపద ఎరుగక
బుద్ధిజాహ్నవకృష్ణు లహీశు లయ్యొ!

ఒకరు [తల ఆడిస్తూ]

ఎక్కడి దీ సంగీతము!

[నృత్య పురస్సరముగా నిష్క్రమణము]

ఒకరు [తల ఊపుతూ]

ఆహా, ఈ గీతవాద్యము ఎంత మనోహరముగా ఉన్నది!

[నృత్య పురస్సరముగా నిష్క్రమణము]

ఒకరు [తాళము వేస్తున్నట్లు తల ఆడిస్తూ]

ఈ మృదంగనాదము ఏమి హాయిగా ఉన్నది!

[నృత్య పురస్సరముగా నిష్క్రమణము]

ఒకరు

ఎవ తా వీణ వాయించేది?

[నృత్య పురస్సరంగా నిష్క్రమణము]

ఒకరు

ఎవరి దబ్బా ఈ వంశధ్వని!

[నృత్యముతో నిష్క్రమణము]

(తెరలో) ద్వారికుడు

హోతృగణము ప్రస్తోత లుద్గాతృచయము
విహితబహుమంత్ర వాచనవిధులు తీర్ప
వీణవలె, వేణువట్లు విన్పింప భ్రమసి
కుండలులు పోదు రిదె యజ్ఞకుండమునకు!

వాసుకి

ఈ కోలాహలములో మాటలే వినబడడం లేదు. బాబులారా, శాస్త్ర శాంతించలేరూ!

(సభ నెమ్మదిగా నిశ్శబ్ద మవుతూ ఉంటుంది ఇంతలో తెరలో కలకలము)

ఒకరు (ద్వారమువంక చూస్తూ)

ఎవరురా నీవు?

(తెరలో) ద్వారికుడు

తీక్ష్ణజిహ్వాలు కాలాగ్ని దీప్తతనులు
విద్యుదుజ్జ్వల ఖడ్గపాశోద్యతోగ్రు

లెవరో మమ్మాక్రమించి జయించి మించి
దూరుచున్నార లీసభాద్వారములను !

ఒకరు

నన్ను ఎవరో బలవంతాన లాక్కుపో తున్నారు, అయ్యో!

ఒకరు

నన్నట్లా లాగబోకయ్యా, దణ్ణం పెడతాను.

ఒకరు

ఎందుకయ్యా నన్నిట్లా కట్టివేశావు!

ఒకరు

నేను శాను పో!

ఒకరు

మహారాజా, నీసమక్షములోనే ఈ దౌర్జన్యము చేసే దుర్మార్గ
లను శిక్షించవేమయ్యా!

ఒకరు

ఎక్కడికయ్యా నన్నిట్లా లాగుతావు!

ఒకరు

ఏమిటీ ఆగడము!

(అగ్నిభటులు దుష్టవాక్యా లాడిన నాగేంద్రుల నందరినీ రక
రకాలుగా లాక్కుపోతూ ఉంటారు.)

ఆస్తీకుడు

ఎప్పటికి నేను గజపురి కేగి యందు
యజ్ఞవాటి నా జనమేజయక్షితీశు
గాంచి పూజించి మిమ్ము రక్షించువాడ,
ఎట్లొ నిలు డంతవరకు నహీంద్రులార!

వాసుకి

శీఘ్రముగా కృతకృత్యుడవై తిరిగి రా ఆయుష్మన్!
(ఆస్తీకుడు పునః ప్రణామము చేసి ఏమీ అంటని వానివలె నిష్కంపముగా నిష్క్రమిస్తాడు).

(వాసుకి హుమ్మని ఫూత్కారము చేస్తూ విజృంభిస్తూ సభను కమ్ముతున్న అగ్నిజ్వాలలు కొన్ని పారదోలుతూ మరికొన్ని దిగమింగుతూ, నిప్పులు కురిసే తన చూపుతో ఆగ్నేయ భటులను తర్జిస్తూ ఉంటాడు).

(సభఅంతా నిర్వాక్కుగా ఉంటుంది)

(తెరపడుతుంది)

(తర్వాతకూడా మంటల భగభుగ ధ్వనీ, దాన్ని తరుముతున్న వాసుకి ఫూత్కారధ్వనీ వినపడుతూ ఉంటవి.)

## మూడవ అంకము

(గంగాతీరములో సర్పసత్రశాల. దూరాన ఎదురుగా పెద్ద కుండములో సర్పహోమము జరుగుతూ ఉంటుంది. దాని సమీపంలో కనపడీ కనపడకుండా యాగక్రియలో నిమగ్నులై

ఉదంకుడు, పింగళుడు, కౌత్సుడూ ఉంటారు. ఉన్నతాసనం మీాద అక్కడనే బ్రహ్మ ఐన శార్‌ఙ్గరవుడు కూచుని ఉంటాడు. ఇంకా ఇతర ఋత్విక్కులు వివిధక్రియలలో మగ్నులై ఉంటారు)
(ఇంకా ఇవతల రురుడు ముఖము హోమమువైపుగా పెట్టుకొని చూస్తూ ఉంటాడు)

(ఇంకా కొంచెము ఇవతల రంగానికి కుడిప్రక్కను శుకుడు శ్రీదేవీభాగవతమూ, ఎడమప్రక్కను వైశంపాయనుడు శ్రీ మహాభారతమూ, చదువుతూ ఉపన్యసిస్తూ ఒకరికొకరు ఎదురుగా ఉంటారు. వాళ్ళవద్ద వింటూ చాలామంది ఉంటారు.
(ప్రేక్షకులకు సమీాపంలో రంగానికి కుడిభాగంలో హోమశాల తన కుడిప్రక్కకూ ప్రేక్షకులు ఎడమకూ ఉండేట్లు జనమేజయుడు దర్భాద్యాసనముమీాద ఉంటాడు. ఆయన పక్కనే భార్య వపుష్టమ. ఇద్దరిపీ దీక్షావేషాలు.
(జనమేజయునికి కుడిభాగాన రంగానికి ఎడమభాగంలో ఆయనకు ఎదురుగానూ యాగశాలకు వీపు కనపడకుండే విధంగా వ్యాసుడూ, ఆయన శిష్యులైన పైల జైమిని సుమంత్వాదులూ, ఇంకా అసిత దేవల నారద మైత్రేయాదులూ, హారిత కౌండిన్య కాశ్యప కౌశిక శాండిల్యాదులూ, మహర్షులు యథార్హంగా కూచుని ఉంటారు. అందులో వ్యాసపీఠము ఉన్నతమై ఆకర్షిస్తూ ఉంటుంది.

(సోమశ్రవసుడు యాగశాలలోకీ ఈ ముందు భాగములోకీ వస్తూపోతూ అడావిడిగా ఉంటాడు.

(ప్రథమాంకంలో వచ్చిన మంత్రీ ఇతరమంత్రులూ వినీతవేషాలతో మహర్షులకు ఉపచర్యలు చేస్తూ ఉంటారు.

(ఒక పక్కన రంగానికి ఎడమవైపున ప్రేక్షకులకు ఎక్కువ సమీపములో సూతుడైన లోహితాక్షుడు నిలుచుని ఉంటాడు.

[ఋత్విజులూ సదస్యులూ జనమేజయాదులూ అందరూ నల్లని వస్త్రాలు ధరించి ఉంటారు.

(దౌవారికుడు జనమేజయునికి వెనుక భాగంలోనుంచి గాని ఎదట చివరలోనుంచిగాని కనపడకగాని కనపడీ కనపడక కానీ ఉంటాడు.)

(తెర ఎత్తబోయే ముందు)

(తెరలో) ఆ కా శ వా ణి

ద్రవ్యశుద్ధియు ఋత్విజదక్షతయును
కర్త శ్రద్ధయు గూడిన కతన నొకట
దేవి కరుణార్ద్ర దృష్టి నీ దివ్యమఖము
గాంచెను, పరీక్షితుండు స్వర్గతికి జనెను!

(తెర ఎత్తుతారు)

జ న మే జ యు డు

(ప్రీతితో ఆలకిస్తూ) ఎంతకాలానికి ఈ శుభవార్త విన్నాము! మా పితృఋణము తీరింది —

వే ద వ్యా సు డు

దేవీమఖపరిసమాప్తితోనే పరీక్షిత్తుకు ఉత్తమగతి లభించింది.

అదే ఈ అశరీరవాక్కు సురప్రేరితమై ఉగ్గడిస్తున్నది.

నారదుడు

దేవీమఖము సర్వసంపన్నము కాకపోతే ఈ సర్పసత్రము ఇంత చక్కగా సాగుతుందా ?

జనమేజయుడు

(ఆనందబాష్పాలు కారుస్తాడు. ఇంతలో క్రోధమావహిస్తుంది.) ఆ తక్షకుడు ఈ యజ్ఞాగ్నిలో ఆహుతి ఐనప్పుడే మా జన్మ కృతార్థ మయ్యేది !

వేదవ్యాసుడు

దీక్షితుడవైన నీ కిప్పుడీ క్రోధము పనికిరాదోయి, వత్సా !

హారీతుడు

నీవు పరమ శాంతముగా ఉంటే మంత్రశక్తి డానంతట అదే నీ కోరికలు తీరుస్తుంది, నాయనా!

జనమేజయుడు

(చేతిలో చేయిపెట్టుకొని పిసుకుకుంటూ కోపము అణచుకుంటూ)

చిత్తముస్వామీ! — (బిగ్గరగా) ప్రధానపశు వైన తక్షకుణ్ణి ఎప్పుడు పిలుస్తారు ?

సోమశ్రవసుడు (వస్తూ)

అందు కింకా సమయముకాలేదు, రాజా! (మళ్లీ యాగశాల వైపు వెళ్లుతాడు.)

(అవతల) రురుడు

అహహా ఎందరు నాగు లున్నారో ఏమొ,
లోక సంతాపకరు లతిలోకవిషులు,
తరగ కిన్నాళ్ళు తండోపతండములుగ
హుతవహుని జేరుచుండ్రి రేయుంబవళ్ళు.

జనమేజయుడు

(సంతోషముతో ముఖము వికసిస్తుంది. ఇంతలో మళ్లీ వివర్ణ మవుతుంది.) ఏమిటీ కాలధూమము అగ్నిహోత్రుణ్ణి కమ్ము తున్నది!

(అవతల) రురుడు

బహుపరాకు, పారీక్షితా, బహుపరాకు!
కాలజలదాలివోలె చీకట్ల యట్లు
యమునయును కృష్ణపొంగిన యటుల నొకట
హవ్యవహు జేరె కృష్ణసర్పావలి ఇదె!

జనమేజయుడు

ఏమిచూచినా యజ్ఞభంగమవుతుందేమోనని అకారణభయము

మధ్య మధ్య కలుగుతున్నది.

[లోహితాక్షునివంక చూస్తాడు.]

కౌండిన్యుడు

ఈ యజ్ఞ మెక్కడ, ఇంత అద్భుతమైన ప్రయోగముతో సాగుతూ ఉంటే!

సోమశ్రవసుడు [వస్తూ]

సూర్యకాంతి ప్రసరించిన శారద మేఘాలవలె మిల మిల లాడుతూ సత్రాగ్నిలోకివస్తున్న ఆ మహానాగులవేపు చూడు, మహారాజా!

[ఋత్విక్కుల వైపు వెళ్ళుతాడు]

[అవతల] రురుడు

జయము జనమేజయా, జయమయ, జయంబు!
భాస్కరోజ్జ్వలు లుల్కాప్రపాతఘోరు
లశనితీక్ష్ణులు శంపాలతాభరోచు
లడగుచున్నా రిదే భోగు లగ్ని శిఖల!

జనమేజయుడు

[వికసించిన ముఖముతో] ఈ మధ్యాహ్న సమయములో ఆకాశానికి సంధ్యాశోభ ఘటిస్తున్న ఆ దృశ్యము చూడండి!

కాశ్యపుడు

ఆ వచ్చేదంతా కద్రువ సంతానమేనా?

(అవతల) రురుడు

కిసలయంబుల దాడిమీకుసుమములను
ఋభువు లీ యాజ్ఞికాగ్ని నర్చింతు రనగ
అపర వైశ్వానర శిఖా ప్రభాభ తనులు
రక్త ఫణు లిదె అనిలసారథిని దొరగె!

జనమేజయుడు

ఆకాశ మంతా తమ దేహ కాంతులతో బంగారు ముద్దగా చేస్తూ వచ్చే ఆ కాకోదర రాజులను చూస్తూన్నారా?

కాశికుడు

ఈ అద్భుత దృశ్యము చూస్తున్నకొద్దీ నాకు దేహము పులకరిస్తున్నది.

[అవతల] రురుడు

కాంచనములో ఇవి సువర్ణకమలము లొకో!
చేర వత్తురా మేరుకుమారు లిటకు
నా వెలుంగుచు నహు లివేచూవె, చొచ్చె
అనలశిఖలందు జనమేజయా, పరాకు!

నారదుడు

ఏమి, ఈ విచిత్రము! సూర్యాస్తమయ సమయంలో అనేక

చిత్రధాతు వర్ణాలతో వెలిగే పర్వత శిఖరాలవలె ఉన్నదీ దందశూక తండము !

జ న మే జ యు డు

మాకు కలిగే ఆనందము మేర తప్పుతున్నది. మా పితృదేవులు స్వర్గములో దీనికి ఎంత సంతోషిస్తున్నారో !

శాం డి ల్యు డు

స్వర్గలోక వాసులు ఎప్పుడూ సంతోషంగానే ఉంటారు.

[అవతల] రు రు డు

విజయ, జనమేజయా, జయ, విజయ, విజయ !
ఇంద్రధనురుజ్జ్వలప్రభానేకచిత్ర
వర్ణభాస్వర భుజగు లపారసంఖ్యు
లగ్నిముఖమున నవశు లల్లదె పడెదరు !

అ సి తు డు

ఈ ఋత్విక్కుల సమర్థత ఏమని పొగడవలె ! ఎక్కడా ఏ మాత్రమూ మంత్రలోపమూ తంత్రలోపమూ లేదు.

దే వ లు డు

ఇంత తొణుకూ బెణుకూ లేకుండా ప్రయోగము గజగమనముతో సాగిపోతున్నది.

జైమిని

ఇటువంటి యాగములో ఏ కొంచెము తొట్రుపాటు పడ్డా ప్రమాదము సంభవిస్తుంది.

మైత్రేయుడు

ఘోరమైన ఈ బ్రహ్మదండ ప్రయోగము మండుతున్న నిప్పుల తోనూ పదునైన కత్తులతోనూ ఆట వంటిది!

పైలుడు

ఈ మహాత్ముల కందరికీ ఇదంతా ఒక లీలగా ఉన్నది! ఈ పెను బాములు కాలే చమురు కంపుతో కూడిన పొగ వీరి కళ్లలోకి పోతే, నెత్తురు ముద్దలుగా ఎర్రబడి వీరి కళ్లు వీరు యజించే సత్రాగ్ని వలెనే ఉన్నవి!

[అవతల] రురుడు

ఒండొరుల కౌగిలించుచు నూతగొనుచు
ఓ యనుచు బిల్చుకొనుచు నన్యోన్య ముఖము
లొక్కవరి చూచుచును రోజు చుల్కుకొనుచు
అరచు చేడ్చెడి అహుల దైన్యంబు కంటె!

సుమంతుడు

అబ్బా, వీరి దురవస్థ చూస్తే జాలికూడా కలుగుతున్నది!

[నెమ్మదిగా] లోహితాక్షుడు

పిల్లలూ పెద్దలూ పసిపాపలతో సహా, పాపము ఈ అగ్నిలోకి

ఊరుకుతున్నారు. సర్పకులమే నాశన మయ్యేట్లున్నది.

[అవతల] రు రు డు

క్రోశదీర్ఘులు యోజనాలోహతనులు
మరియు సంగుష్ఠ గోకర్ణమాత్రు లహులు
శతములు సహస్రములును లక్షలును గోట్లు
నర్బుదంబులు చేరెడి హవ్యవాహు!

కొన్ని తురగంబు లటు మరికొన్ని హస్తి
హస్తముల యట్లు మదకరు లట్ల కొన్ని
పరిఘముల పోల్కి మరికొన్ని ప్రబలఫణులు
చూడనై కృష్ణవర్త్మని జొచ్చె నిదిగో!

హా రి తు డు

రణరంగములో బీభత్స దృశ్యాల కలవాటు పడ్డ రాజులే కాని మాబోటివాళ్ళు ఇటువంటి ఘోర క్రతువులు చివర వెళ్ళ చూడలేరు, మహారాజా!

జ న మే జ యు డు

[తొట్రుపాటుతో] మహాత్మా, మహాత్మా! యజ్ఞ పశువిశసనముకూడా హింసగా భావిస్తున్నారా, స్వామీ?

హా రి తు డు

(వెంటనే) కాదు, కాదు! — ఎందుకో మాట తడబడ్డది!

(అవతల) రురుడు

రెండు మూ డేడు పదియు పండ్రెండు తలలు
బహుశిరస్సులు గల మహాబలులు వాత
వేగు లాశీవిషుల నగ్ని వేల్తు రదిగొ,
బహుపరాకు, పారీక్షితా, బహుపరాకు!

హుతము లైనవి హుతమగు చున్నవియును
హుతము కానున్నవై యొప్పు నురగతతుల
పుచ్ఛముల గొన్నిటి శిరోగ్రములుగ కొన్ని
కీలి పర్చి నదించు సంగీతము విను!

జనమేజయుడు

ఈ వచ్చే సర్పాలను చూసిన కొద్దీ ఈ రురునికి ఏమి ఆనంద ముప్పొంగు తున్నది!

నారదుడు

తన ఆయుర్దాయములో సగము ఇచ్చి సర్పదష్టురా లైన తన ప్రియురాలు ప్రమద్వరను పునరుజ్జీవింప జేసుకున్నా డీ మహా త్ముడు! మరి—

జనమేజయుడు

ఇటువంటి మహానుభావులకు తృప్తి కలిగించడము కంటె నాకు వేరే కావలసిన దేమున్నది!—తక్షకుణ్ణి పిలిచేవేళ కాలేదా?

(వస్తూ) సోమశ్రవసుడు

దగ్గరకు వస్తున్నది, మహారాజా! సావధానంగా ఉండు!

(ఋత్విక్కుల వేపుకు వెళుతాడు.)

(పక్క తెరలో) ఆస్తీకుడు

సోము యాగంబు వరుణు విశుద్ధ యజ్ఞ
మా ప్రయాగ ప్రజాపతి యజ్ఞ మెట్టు
లట్టి ఈ యజ్ఞమో భారతాగ్ర్య వెలసె,
స్వస్తి యగు గాత, జనమేజయాప్రియులకు.

(సదస్యులంతా శ్రద్ధగా ఆలకిస్తారు)

జనమేజయుడు

ఎవరి దా మధురవాణి!

(పక్క తెరలో) ఆస్తీకుడు

శక్రు యాగంబు యముని యజ్ఞంబు రంతి
దేవుని మఖంబు గయు సత్ర మే విధములో,
అట్ల ఈ యజ్ఞ మో భారతాగ్ర్య వెలసె
స్వస్తియగు గాత, జనమేజయాప్రియులకు.

జనమేజయుడు

చిరకాలాగతుడైన ప్రియమిత్రుని వాక్యాలవలె, విన్నకొద్దీ, ఎవరో, ఇతని వాక్కులు ప్రీతి కలిగిస్తున్నవి. (బిగ్గరగా) ఎవరురా అది!

(ఆ పక్కనే తెరలో) దౌ వా రి కు డు

నిజతనూరేఖ దిక్కు లున్నిద్రములుగ
ఎవరొ అజ్ఞాత భూదేవు డితడు దరిసె;
భాస్కరుండొ విధుండొ వైశ్వానరుండొ
కాక సాక్షాద్విధాతృడే కానువచ్చు!

(పక్క తెరలో) ఆ స్తీ కు డు

దాశరథి యశ్వమేధంబు ధనదు క్రతువు
ఆ యుధిష్ఠిరు రాజసూయంబు నెట్లు
అట్లె ఈ యజ్ఞ మోభారతాగ్ర్య! వెలసె,
స్వస్తియగుగాత జనమేజయాప్రియులకు!

జ న మే జ యు డు

శీఘ్రంగా ఆ బ్రాహ్మణోత్తముణ్ణి ప్రవేశపెట్టు!
(ఆస్తీకుడు ప్రవేశిస్తాడు. అతన్ని చూడగానే సదస్యుల కందరికీ ప్రీతి కలుగుతుంది)

జ న మే జ యు డు

హోమము విరమించిన ట్లున్నారే? — ఎందువల్ల?

(వస్తూ) సో మ శ్ర వ సు డు

మహారాజా! సామాన్య సర్పప్రభువు లంతా వచ్చి హుత మైనారు. ఈ యజ్ఞానికి ప్రధాన పశువైన తక్షకుణ్ణి ఇప్పుడు

పిలవబోతున్నారు. నీకు నివేదించడానికి వచ్చాను. [ఋత్వి క్కుల వైపుకు వెళ్ళిపోతాడు.]

జనమేజయుడు

[ఆస్తీకునివంక చూస్తూ ఆనందముతో]

ఈ బ్రాహ్మణోత్తముడు నాకు బ్రహ్మానందంగా ఉన్న ఈ సమ యంలో సరిగా వచ్చినాడు!

ఆస్తీకుడు (కుడిచేయి ఎత్తి)

వృత్రహాణు యజ్ఞమట్లు ఋత్విక్కు లిందు
సూరతుల్య వర్చస్వులు చేరినారు;
వ్యాసుడె సదస్యుడయ్యె శిష్యాలి గూడి
వేర ఏమందు నిందు ఋత్విజుల మహిమ!

[దూరాన ఋత్విక్కులు అంతా ఏకగ్రీవంగా శస్త్రాలు చదివేట్లు ఉచ్చైఃస్వనంతో]
తక్షక ఏహి !

[ఆ ఆహ్వానస్వరము చాలా సేపటిదాకా యజ్ఞశాల అంతా ప్రతిధ్వనిస్తూ ఉంటుంది. శాలలో వేరే శబ్దముండదు.]

ఆస్తీకుడు

ఈ ప్రదక్షిణావర్త శిఖాప్రదీప్త
డయిన హుతభుక్కు హవ్యవాహనమహాత్ము

డిందు నీ విచ్చు హవ్యంబు లందజేయు
ప్రీతుపై క్రతుభుజులకు విహితవిధిని !

[పూర్వోక్తంగా] ఋత్విజులు

తక్షక ఏహి !

[ఆ ఆహ్వాన ప్రతిధ్వని అణగే దాకా శాలలో వేరే ధ్వని ఉండదు.]

ఆస్తీకుడు

లోకములు మూడు దాల్చు నింద్రుండువోలె
ప్రజల పాలింతు రక్షింతు ప్రౌఢి మెరసి
పృథివిలో నీ సమానులు నృపులు లేరు!
స్వస్తి గావుత, జనమేజయాప్రియులకు!

నిభృత వీర్యుండ వీవు వాల్మీకిపోల్కి
నియత కోపుండవు వసిష్ఠనియతు రీతి
సువ్రతుండవు నీవు భీష్ముండువోలె
అఖిలధర్మవిదుండ వా యముని భాతి !

[పూర్వోక్తవిధంగా] ఋత్విజులు

తక్షక ఏహి !

(ఆ ఆహ్వాన ప్రతిధ్వని అణగేదాకా శాలలో వేరే ధ్వని ఉండదు.)

ఆస్తీకుడు

అల యయాతి దిలీపఖట్వాంగతుల్య !
దివ్యతేజస్వి వా విష్ణుదేవు నట్లు
సకల సద్గుణశాలి వా శౌరి వోలె
స్వస్తి గావుత జనమేజయాప్రియులకు!

జనమేజయుడు

ఈ బ్రాహ్మణు డెవరోగాని బాలుడైనా స్థవిరునివలె మాట్లాడుతున్నాడు.

నారదుడు

బాలుడైనా విద్వాంసుడైన బ్రాహ్మణుడు మాననీయుడుగదా !

జనమేజయుడు

ఇతన్ని చూచినప్పటినుంచీ నా అంతరంగములో ఆనందము వెల్లివిరు స్తున్నది.

హారితుడు

ఇతన్ని చూచిన ప్రతివారికీ అలాగే ఉన్నది రాజా!

జనమేజయుడు

ఈ కుర్రవానికి ఏదైనా వర మివ్వవలెనని కోరిక కలుగుతున్నది.

[వస్తూ] సోమశ్రవసుడు

అవశ్యము కానీ స్వామీ, తక్షకుడు మరి త్వరగా రావద్దూ!
(ఋత్విక్కులవైపుకు వెళ్ళిపోతాడు.)

జనమేజయుడు

[ఆస్తికునితో] బ్రహ్మన్, నిన్ను చూడగానే అకారణ వాత్సల్య రసము పుట్టి నా హృదయములో అమృతబిందువులు చలిస్తు న్నట్లు చక్కిలిగింత కలుగుతున్నది. నీకు —

[అర్థోక్తిలో దూరాన ఋత్విజుల కేకలు విని ఆగుతాడు.]

[పూర్వోక్తంగా] ఋత్విజులు [దూరాన]

తక్షక ఏహి! - తక్షక ఏహి! - తక్షక ఏహి!-

[ఆ శబ్దము తప్ప శాల అంతా నిశ్శబ్దము.]

[యాగశాలలోనుంచి] ఉదంకుడు

[గంభీరమైన ఆతురతతో] ఎంత పిలిచినా తక్షకుడు రాకు న్నాడు, రాజా!

జనమేజయుడు

(వివర్ణవదనుడై) ఎందువల్ల? ఎందువల్ల? — లోప మేమైనా జరిగిందా?

జైమిని

కర్మకలాపములో ఎక్కడా ఏమీ లోపము లేదు.

జ న మే జ యు డు

అయితే, తక్షకుడు ఎందుకు రాడు స్వామీ ?

[వస్తూ] సో మ శ్రీ వ సు డు

తక్షకుడు ఇంద్రభవనంలో ఉన్నట్లు అగ్నిహోత్రుడూ ఋత్విక్కులూ సెలవిస్తున్నారు.

నా ర దు డు

భయపీడితుడై తక్షకుడు ఇంద్రభవనం చేరినట్లు పౌరాణికుడైన మన సూత్రధారుడుకూడా చెపుతున్నాడే !

జ న మే జ యు డు

[లోహితాక్షునితో] ఏమిటి — ?

లో హి తా క్షు డు

అగ్నిహోత్రుడూ ఋత్విక్కులూ చెబుతున్నట్లే నేనూ పురాణజ్ఞులవల్ల తెలుసుకున్నాను, స్వామీ ! తక్షకుడు సత్రాగ్నికి భయపడి దేవలోకము పోయి ఇంద్రుణ్ణి శరణు చొచ్చినాడు. దేవేంద్రుడు అతనికి అగ్నిభయము లేకుండా అభయ మిచ్చినాడు.

జ న మే జ యు డు

[కోపముతో] ఉదంక మహాత్మా ! నీ చండ భార్గవత్వము సార్థక మయ్యేట్లు వెంటనే తక్షకుడు ఇంద్రలోకంలో నుంచి

వచ్చేట్లు ఆకర్షించు! బ్రహ్మాదండను ఉద్దీపింప జేయండి ! త్వర పడండి! ఈ యజ్ఞానికి ప్రధాన పశువే రాకపోతే —

[కొంతసేపు నిశ్శబ్దము]

[దూరాన] ఋత్విక్కులు

[పూర్వోక్త స్వరంతో]

తక్షక ఏహ్యేహి !
ఏహ్యేహి తక్షక !
తక్షక ఏహ్యేహి !

[ఋత్విక్కుల వైపు సదస్యు లంతా చూస్తూ ఉంటారు. ఆహ్వానశబ్దము అణిగిన తర్వాత]

[అవతల] రురుడు

అల్లదే చూడు డీ యపూర్వాద్భుతంబు
కాన నయ్యెడి దివ్యవిమాన మెక్కి
సామనుడు సాప్సరసుడై బలారి అతని
ఉత్తరీయాన తక్షకుం డుడుకు నడుగో!

[దూరాన] ఉదంకుడు

ఎంత ఆకర్షించినా తక్షకుణ్ణి దేవేంద్రుడు వదలడం లేదు!

జనమేజయుడు

[తీవ్రకోపముతో] ఉదంకమహాశయా ! ఇంద్ర శరణుడైన అతన్ని ఇంద్రుడు వదలకపోతే ఇంద్రునితో సహా తక్షకుణ్ణి

బ్రహ్మాదండముతో ఆకర్షించండి స్వామీ! త్వరపడండి!

[అంతా కొంచెము సేపు నిశ్శబ్దము]

[పూర్వోక్త స్వరముతో] ఋ త్వి క్కు లు

స హేంద్ర త క్ష క ఏ హి!

[ఆహ్వానశబ్దము అణగిన తర్వాత]

[అవతల] రు రు డు

బ్రాహ్మణామంత్రణము విని త్రస్తుడగుచు,
తక్షకు త్యజించి ఇంద్రుండు తరలి చనెడి!
వివశుడై తక్షకుడు వినువీధి జారుగు
యజ్ఞశాలాప్రవనదక్షిణోద్యమము పూని

[పూర్వోక్త స్వరంతో] ఋ త్వి జులు

త క్ష క ఏ హి!—త క్ష క ఏ హి! త క్ష క ఏ హి! —

[ప్రతిధ్వని అణగిన తర్వాత]

జ న మే జ యు డు

ఏమి టీ మహానాదము? వైనతేయుని పక్షధ్వనివలె విన వస్తున్నది?

[యాగశాలనుంచి] ఉ దం కు డు

రాజా, ఈ యజ్ఞకర్మ మళ్ళీ నిర్విఘ్నముగా విధి విహితముగా సాగుతున్నది. నీ కులద్వేషి ఐన తక్షకుడు వస్తున్నాడదుగో!

[జనమేజయుడు సంతోషముతో బిగ్గరగా నవ్వుతూ ప్రేమతో ఆస్తీకునివైపు చూస్తూ ఉంటాడు.]

[వస్తూ] సోమశ్రవసుడు

ఆ వినపడే మహాశబ్దము ఇంద్రుడు వదలిపెట్టగా వస్తున్న తక్షకుడిదే రాజా! ఈ బ్రాహ్మణునికి వరమిస్తా నంటివే మహారాజా! త్వరగా తక్షకుడు వస్తాడు. ఈ బ్రాహ్మణునికి వెంటనే వరదానము చేయి! [అవతల యాగశాలలోకి వెళుతాడు.]

జనమేజయుడు

బాలరూపుడ వైన బ్రహ్మన్! నీకు వరమివ్వ వలెనని మాకు ప్రబలకాంక్ష కలుగుతున్నది. నీ మనస్సులో ఉన్న కోరిక చెప్పవోయి. అది ఎంత ఇయ్యరానిదైనా తప్పక ఇస్తాను, కోరుకోవోయి నాయనా?

[ఆస్తీకుడు మాట్లాడబోతూ ఉండగానే అవతలనుంచి]

రురుడు

నిజ రయోద్ధూతవాతూల రజము రేగ
కకుభములు నిండ భైరవ గర్జనములు
తక్షకుడు సత్రకుండంబు దరిసె నిడుగో
పవినిహతపత్త్రు డగు హిమవంతుకరణి?

ఆస్తీకుడు

మహారాజా! నిజముగా నాకు వర మీయ దలచినావు గనుక

ఇదే కోరుకుంటున్నాను. వెంటనే ఈ సర్పసత్రము చాలించవలసింది! ఇక ముందు ఉరగు లెవ్వరు ఇందులో పడకుందురు గాక!

[కుండములో పడుతున్న తక్షకునివైపు పైకి చేయి ఎత్తి] తక్షక! ఆగు—ఆగు—ఆగు!

జ న మే జ యు డు

[వివర్ణుడై] ఇదేమి వరమోయి నాయనా! కావలసినంత సువర్ణమో, రజతమో, కాక కావలసినన్ని గోవులో, రత్నాలో ఏవో కోరుకోవోయి! ఈ యజ్ఞము ఆపితే నీ కేమి లాభమున్నది, మహానుభావా?

ఆ స్తి కు డు

రాజా! నాకు సువర్ణమూ వద్దు, రజతమూ వద్దు, గోవులూ వద్దు, మణులూ వద్దు! నా కెందు కవి? ఈ సత్రము విరమించు! మా మాతృకులానికి స్వస్తి కలగనీ!

జ న మే జ యు డు

మా పితృదేవులకు ఈ తక్షకుడు చేసిన అపరాధానికి అతన్ని శిక్షించదలచి ఈ యాగము ఆరంభించినానోయి! తక్షకుణ్ణి మాత్రము వదలిపెట్టి, పోనీ నీ వరము చెల్లించుకో!

[యాగశాలలో] ఉ ద ం కు డు

అగ్నిలో పడుతూ పడుతూ తక్షకుడు అకస్మాత్తుగా ఆగిపోయినాడు!

[అవతల] రు రు డు

ఆగు మాగని ఆస్తికు డన్నమాత్ర
అగ్ని బడనున్న తక్షకు డాగిపోయె

స్వర్గవిచ్యుతు డయ్యు త్రిశంకునృపతి
గాధిజుని యాజ్ఞ నున్నట్లు గగనవీధి.

ఆస్తీకుడు

నీవు కోరుకో మనకపోయినా నిన్ను ఈ సత్రము విరమించమని యాచించడానికే ఇక్కడికి వచ్చాను, రాజా! తక్షకుడు బ్రాహ్మణ శాపానికి మిషమైనాడే కాని మీ పితృదేవులకు శత్రువు కాడు. నీవు సత్యప్రతిజ్ఞుడవై నాకు వరమీయ దలస్తే ఈ సత్రము ఆపుటకు వెంటనే అనుజ్ఞ దయచేయించు మహా రాజా!

వైశంపాయనుడు

[పక్కనుంచి] మహారాజా! శ్రీమహాభారత పఠనము సమాప్తి పొందింది. ఉత్తమమైన దాన మొకటి నీవు చేయవలసిన సమయము ఇది!

జనమేజయుడు

చిత్తము, స్వామీ! చిన్నవాడా, నీ వరము మార్చుకోవా?

ఆస్తీకుడు

మార్చుకోలేను, క్షమించు రాజా!

[పక్కనుంచి] శుకమహర్షి

శ్రీదేవీభాగవత పఠన పాఠనము సమాప్త మయింది. సత్వగుణ ప్రధానమైన దాన మేదైనా ఒకటి చేయడానికి ఇదే సమయము రాజా!

జనమేజయుడు

చిత్తము దేవా! నాయనా, మార్చుకోవా!

ఆ స్తి కు డు

క్షమించు రాజా!

జ న మే జ యు డు

[వేదవ్యాసునివంక చూస్తూ] ఏమి సెలవు భగవన్?

వే ద వ్యా సు డు

వత్సా! ఈ ఆస్తికుడు కోరే వరము అవశ్యంగా ప్రసాదించ వలసిందే!

[హర్షధ్వానులతో] స ద స్యు లు

ఆస్తికుని వరము వ్యాసప్రోక్త మయింది!

నా ర దు డు

కాకపోతే ఇస్తానని వాగ్దత్తము చేసిన వరము ఇయ్యవద్దని ధర్మమూర్తి అంటాడా?

అ సి తు డు

దేవేంద్రుడు అభయప్రదానము చేసిన తర్వాత చెల్లించకపోతే లోకాలకు అనర్థము రాకుండా ఉంటుందా?

జ న మే జ యు డు

భగవన్! నీవు కోరుకున్న వరము మనస్స్ఫూర్తిగా ప్రీతిపూర్వకంగా ఇస్తున్నాను. గ్రహించి నన్ను కృతార్థుణ్ణి అయ్యేట్లు అనుగ్రహించు స్వామీ!

ఆ స్తి కు డు

అనుగ్రహీతుడనైనాను రాజా, మన ప్రియుల కందరికీ స్వస్తి!

దే వ లు డు

పౌరాణికుడైన సూతుడు ముందుచెప్పిన వాక్యము సత్యమయి నది.

జనమేజయుడు

ఈ సత్రము వెంటనే ఆపే ఏర్పాటు చేయవలె స్వామీ! — వేదవ్యాసుల ఆజ్ఞ!

[వస్తా] సోమశ్రవసుడు

చిత్తము రాజా!

[ఋత్విజులవద్దకు పోతాడు]

వేదవ్యాసుడు

నీ విక అవభృథస్నానముచేయి నాయనా! ఋత్విజుల నందరినీ, ఈ శిల్పి సూత్రధారుణ్ణి యథావిధిగా భూరి దక్షిణలతో అర్చించు! తక్షకుణ్ణి ఆదరించి ఆస్తికునితో పాటు సత్కరించి పంపు! ద్వేషబుద్ధితో నీవు చేసిన ఈ తామసయాగ శాంతికై శీఘ్రమే అశ్వమేధయాగము సంకల్పించు వత్సా!

జనమేజయుడు

మహాప్రసాదము, భగవన్! [ఆస్తికునితో] మేము చేయబోయే అశ్వమేధము వచ్చి తప్పక దర్శించవలె!

[ఋత్విక్కు లంతా యాగశాలనుంచి హర్షధ్వనులతో వస్తారు]

ఉదంకుడు

జయజయాఖిల శిష్టరక్షణ ధురీణ!
సర్పసత్రనివర్తిత సాధుచరిత!
పూజిత బ్రాహ్మణాభీష్ట పుణ్యమూర్తి!
జయము, జనమేజయా! నీకు జయము! జయము!

రురుడు, ఋత్విక్కులు, సదస్యులు

తథాస్తు! తథాస్తు!

[యాగశాలలోనుంచి తేరుకొని ప్రవేశించి]

తక్షకుడు

జయ జయ జనమేజయమహారాజా! [తనకు ప్రణామముచేసిన ఆస్తికునితో] చిరంజీవ, ఆయుష్మాన్!

ఆస్తికా! నిన్ను స్మరియించి ఆగు మనుచు
సర్పసత్రాంతపు ప్రతిజ్ఞ స్మరణచేయ
ఆగు నెంతటి సర్పమే నాగకున్న
శింశఫల మట్టు లద్దాని శిరము పగులు!

ఆస్తికుడు

మహాప్రసాదము! మనము భగవాన్ వాసుకికీ శుభవర్తమానము చెప్పబోవలె!

జనమేజయుడు

[తక్షకునికి తన కర మందిచ్చి]

మన మిక ముందు మిత్రుల మైనాము. ఆస్తికుని దర్శనము చేత నాలో ద్వేషబుద్ధి నశించింది.

[ఇద్దరూ చేతులు కీలిస్తారు]

ద్విజులంతా

ఓం సహనా వవతు సహనౌ భునక్తు
సహవీర్యం కరవా వహై తేజస్వినావధీత మస్తు
మా విద్విషావహై ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః!

[హర్షధ్వానుల మధ్య తెర పడుతుంది. తర్వాత కూడా హర్షహాలహాలా శబ్దము వినవస్తూ ఉంటుంది.]

[సమాప్తము]

# ఉప సంహార వచనములు

సర్ప సత్రము 'జయ'ము లోని సర్పయాగము. వ్యాసభట్టార కుల హృదయమును సమ్యగవగాహన మొనర్చుకొన్న శ్రీనోరి నరసింహ శాస్త్రి అత్యద్భుత నాటికగా విశేషార్థ స్ఫూర్తితో ఈ సర్ప సత్రమును వెలయించినారు.

ఈ సర్ప సత్రము ఆర్ష వాణీ మధురము. ఋషి కల్పులగు వారికి గాని ఆర్ష వాక్కు అలవడదు. సహజమైన నోరి ప్రసన్నత ఆర్ష దీప్తితో నైనది. నాటిక ఆద్యంతము ఉత్తరోత్తరా కర్షముగా సాగినది.

శాస్త్రిగారు భావనా బలముతో పాతాళమును మనకు ప్రత్యక్షము చేసిరి. ఆ పాతాళ లోకము, ఆ నాగుల ఉద్వేగము, ఆ ఋషుల సంభాషణములు వీని చూడ జూడ ఆ వ్యాస భగవానుని హృదయము ఈ సర్ప సత్రమున సంపూర్ణముగా స్వరూప మందిన దనిపించును.

ఏ కృతియైన నుద్దిష్టార్థనిర్వాహణమున గాని సఫలము గాదు. తన కావ్యమును తాను మెచ్చుకొనుటకన్న సహృదయుల మెప్పునకే ప్రాధాన్యము. నృసింహ రచన లన్నియు ఉద్దిష్టార్థ నిర్వాహకములుగా సహృదయుల మన్నన లందుకొన్న వే! నరసింహశాస్త్రిగారు సిద్ధ హస్తులు !

ఒక్కొక్క ప్రయోగమునం దెన్నియేని రహస్యము లుండును. వానిని గురుముఖమున తెలిసికొని అనుభవమున సిద్ధము చేసి కొన్నగాని కవిత్వమున నడుకవు. ప్రామాణికులైన శాస్త్రిగారు ఎవరి నెట్లు ప్రవేశ పెట్టవలెనో, ఎవరెట్లు సంభాషింపవలెనో, అర్హత నెఱిగి వానినెల్ల ప్రయోగమున అపూర్వ

ముగ ప్రదర్శించిరి. పూర్వాచార సంప్రదాయములకు వీరి రచనలు దర్పణాయితములు.

శ్రీ వారి పద్య రచనలలో ఒక విశిష్టత ఉన్నది. పద్యములలో అతుకులు లేక అప్రస్తుతములను పులమక భావానుగుణముగ రచన సాగిపోవుట. శబ్దార్థ సమ్మేళనలోని వారి ఒడుపు వారి ప్రాక్తన జనుస్సమాగతమైన శక్తి విశేషము.

పద్యముల ఉపక్రమోప సంహారాల నైపుణ్యము, సందర్భ శుద్ధమైన స్వాగీతి చూడగా ఆ పదముల వెనుకనుండి హోమాగ్ని సంతప్తులగుచున్న ఆ నాగులు, వారి ఆకార చేష్టితములు, ఆ మహర్షులు, ఆ జనమేజయుడు అపరోక్షముగ దర్శన మిత్తురు. ఉచిత ప్రయోగమున శబ్దమున కెంత శక్తి కలదో! ఎన్నడో కలి యుగాది జరిగిన ఆ సర్ప యాగము భావముల మధ్య సాగి సాగి, కలిలో అయిదువేల సంవత్సరముల పిమ్మట కవిసమ్రాట్టు శబ్ద ప్రపంచమునుండి స్వరూపము ధరించి, సహృదయ లోకానికి అందింది. కవి పరమేష్ఠి రచన అనగా నిదియే నేమో!

ఋత్విగ్గణ ప్రేరితమైన ఒక మహావాతూలము నాగలోకముతో పాటు వాసుకిని గూడ చుట్టు ముట్టును. సమీప వాతూలమును వాసుకి మ్రింగును. మహాసర్ప జాతి వాయు భక్షణత ఇక్కడ సార్థకమైనది. సర్పమాత్ర బాధకమైన ఋత్విగ్గణ మంత్రశక్తి జన్య మహావాతూలము అచ్చటి ఆస్తీకునకు సోకనే సోకదు. ఇది అనన్య పరతంత్రమగు శాస్త్రిగారి అద్భుత చిత్రణ.

రురుని పాత్రము నుండి ఇదానీంతన కవిని పోల్చుకొన

వచ్చును. హోమకుండాగ్నిలో పడుచున్న నాగులను శ్రద్ధగా చూచి వర్ణించుట ఆ రురునకే చెల్లును. సర్పదంశన నిమిత్తముగా అర్ధాయుష్కుడగు రురుడు ఆనందముతో సర్పకుల ప్రళయమును వర్ణించుట మిక్కిలియు సమంజసము.

నాటిక జనమేజయ స్వప్నవృత్తముతో ప్రారంభ మగును. అది సర్ప సత్రమునకు బీజము. అది రురుని ఆదేశముతో ఉదంకుని ఆదేశ ప్రోత్సాహములతో కద్రూ శాపముతో, మహర్షి సముదయాంగీకారముతో పరిపుష్టమైనది. సర్ప సత్రములో ఈ ప్రయోగ రహస్యము సుస్పష్టము.

భాసనాటక నిర్మితి వానిలోని శ్లోకరచనా విశిష్టత అద్వితీయములు. ఈ సర్పసత్ర రచనయు, ఇందు ఉదాత్త మనోజ్ఞముగ నడచిన పద్య రచనయు ఆ కోవకు చెందినవే అని సహృదయులకు తోపక మానదు. ఇట్టివి సాహితీ ప్రపంచమున అరుదుగా కాని పుట్టవు. ఈ రూపక విశేషము కలిగించిన ఆనందము నా చే దీనికి సంస్కృతానువాదము చేయించినది.

నా యెఱిగినంత వరకు శాస్త్రిగారు రచింప దలచిన విషయమును సర్వథా పరిశ్రమచేసి బహుకాలము మననముచేసి మథించిగాని వ్రాయరు. ఈ సర్ప సత్రము సర్వాంగీణశోభానీరంధ్రముగాక విస్రమాడ్భావనావీథినుండి అవతరించిన నాటికా తరళ మణి.

మార్గశీర్ష శు. ఏకాదశీ<br>సోమవారము రేపల్లె

కోగంటి సీతారామాచార్యులు<br>సాహితీ సమితి సహాయకార్యదర్శి

